# శ్రీరామప్రవాసము.

ఇయ్యది

మ॥ రా॥ రా॥ ద్రోణమరాజు సీతారామారావుగారిచే

రచియింపఁబడి,

రాజమండ్రివాస్తవ్యులును బుక్కుసెల్లరునగు

## కర్రా అచ్చయ్యచేఁ

ప్రకటింపఁబడినది.

మొదటికూర్పు, 1000.



స్కేప్ అండ్ కంపెనీ ముద్రాక్షరశాలను ముద్రితము.

1914



0-8-0 అణాలు.

# పీఠిక.

ఇందు కైక దశరథునివరంబులు కోరినది మొదలుకొని, రాముండ వనంబులకేగి, సీతను గోల్పోవువరకును వ్రాయబడి శ్రీరామ ప్రవాసమని నామంబీయఁబడినది. కథాసంగ్రహం బందరికినిఁ దెలిసినదే యగుటంజేసి విస్తరించి వ్రాయలేదు. రామకథయందుండు గౌరవముచేతనైనను నానాటకంబులను దప్పక జదువుదురని నానమ్మకము. ప్రమాదవశంబున నిందుఁ గలిగిన దోషంబులకుఁ బండితులు నన్ను మన్నింపఁ బ్రార్థితులు.

రాజమండ్రి.

ఇట్లు,
ద్రోణంరాజు సీతారామారావు.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రలు.

పురుషులు.

1. దశరథుఁడు—సాకేతపురాధిపతి.
2. రాముఁడు.
3. లక్ష్మణుఁడు.
4. భరతుఁడు.
5. శత్రుఘ్నుఁడు.

(2–5) దశరథుని సుతులు.

6. వసిష్ఠుఁడు—ముని.
7. సుమంత్రుఁడు—రథసారథి.
8. గుహుఁడు—నిషాదుడు.
9. ఖరుఁడు.
10. దూషణుఁడు.

(9–10) రక్కసులు.

11. రావణుఁడు—లంకాపురాధీశ్వరుఁడు.
12. మారీచుడు—రక్కసుడు.

స్త్రీలు.

1. కైక—దశరథునిభార్య.
2. మందర—దాసి.
3. శూర్పణఖ—రావణుని చెల్లెలు.



# శ్రీ రామ ప్రవాసము.

నాంది.

చ॥ జనకుని సత్యవాక్యమును ♦ సంశయమేర్పడఁగాన ; జానకీ
వనితయు నుద్ధతతమ్ముఁడును ♦ భక్తిమెయిన్ దనవెంటరాగ న
వ్వనములకేగి రక్కసుల ♦ భంజనజేసినయట్టి రాముఁడా
మనుకులవార్ధిచంద్రుఁడు శుభంబుల మీకిడుఁగాత సత్కృపన్

అతివిస్తరంబేల ? (తెరవంకఁజూచి) మారిషా ! నీవొకసారి యిటురమ్ము.

మారి—(ప్రవేశించి) ఆర్యా ! ఏమిసెలవు ?

సూత్ర—మారిషా ! ఈసభ్యులు నన్నుఁ బిలిచి జనకాజ్ఞను మాఱిపైఁదాల్చి రాముండరణ్యంబునకు, జాయయును తమ్ముండును వెంటనేగ, బోవుట కేమికారణమో యయ్యది తెలుపు నాటకంబును బ్రదర్శింపుమని యాజ్ఞనిచ్చిరి.

మారి—ఓహో శ్రీరామచంద్రుని పవిత్రచరిత్రమా ! దేవా ! ఇప్పుడు మనము ప్రదర్శింపఁబోవు నాటకనామం బెయ్యది ?

సూత్ర—నీవెఱుంగవా ? శ్రీరామప్రవాసము. ద్రోణంరాజు సీతారామరాయవిరచితంబగు శ్రీరామచరిత్రసంబంధమైన యైదు నాటకంబులయందును నిది రెండవయది.

మారి—ఓహో ! దీని కాతఁడా గ్రంథకర్త. ఇయ్యది ప్రదర్శించి సభ్యులను మనమానందపఱుపఁగలమా ? లేమా యని సందియంబు జనించుచున్నది. (ఆలోచించుచున్నాఁడు)

సూత్ర—తే॥ గీ॥ రామచంద్రు నేరీతి నరణ్యములకుఁ
బంపఁగల్గుదునంచును ♦ భావమందు
సందియంబందు దశరథు ♦ జాయపగిది
శంకనొందెదవేల నీ ♦ స్వాంతమందు.

మిత్రమా ! సభ్యులందఱును సరసులు. గుణంబునే గ్రహింతురు. ఇంక సందియంబందక ప్రస్తుతకార్యంబుదెస వర్తింతము. రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది ప్రస్తావన.



# శ్రీరామప్రవాసము.

## ప్రథమాంకము.

[కైక — సౌధము, మందరప్రవేశము]

మంద — (స్వగతము) ఏమిచెప్పుదు! నేఁడీసాకేతపురం బిట్లలంకరింపఁబడినది. ఆహా! ఏమి యీపురవైభవము.

సీ॥ ఎచ్చోటఁజూచిన ♦ నచ్చోట వినుపించు
మంగళారవములు ♦ పొంగ మనము
ఏచాయ దిలకింప ♦ నాచాయఁగనుపించు
మాధవుభజియించు ♦ భక్తసమితి
ఏప్రక్కఁగనుఁగొన్న ♦ నాప్రక్కఁ గనుపించు
వారాంగనల యాట ♦ పాటసొంపు
ఏజాడవీక్షింప ♦ నాజాడఁగనుపించు
జయరఘూత్తమయను ♦ శబ్దజాల
తే॥ గీ॥ మిట్లు మంగళోపేతమై ♦ యెన్నరాని
శోభకును నిక్కయౌచును ♦ సొంపుగుల్కు
భవ్యసాకేతనగరంబు ♦ వర్ణనంబు
సేయఁ దరమౌనె వేనోళ్ళ ♦ చెలువకైన॥

తే॥ గీ॥ ప్రతిగృహంబందు ననఁటికంబములనాటి
తోరణంబుల గట్టిరింపార; ద్యుమణి
దీప్తి ఖండింపఁ బెట్టిరి దీపసమితి
పరమసుగుణాఢ్యు లిప్పర వాసులెల్ల.

(ఎదుటఁజూచి) భళిరా!

మ॥ అలదేవేంద్రు సతీశిరోమణి మహా యంతఃపురంబున్ మహో
జ్వలరీతిన్ విలసిల్లుదీపమొ మదిన్ భావించి వీక్షింపఁగా
నలమార్తాండుఁడు నేలకుం దిగెను సుద్యత్కాంతినన్నట్లు, భూ
తలనాథాత్మజు రామ సౌధమున సత్కాంతిం బ్రకాశించెడున్.

ఈపురంబిట్లు శృంగారించుట కేదియో యొక గొప్ప కారణముండి తీరవలయును. శ్రీరామజననమహోత్సవమునకైనను నింత శృంగారించి యుండలేదు. రెండురోజులనుండి యిల్లువిడిచి రాకపోవుటచేత వార్తలేమియుఁ దెలియుటలేదు. అదుగో! యెవ్వఁడో వృద్ధకంచుకి యిట్లు వచ్చుచున్నాఁడు. ఆతనిని గనుంగొనినచో నీయుదంతంబంతయు సమగ్రంబుగఁ దెలియును. (ప్రక్కఁదిరిగి చూచి) ఓయీ! కంచుకీ! నేఁ డీపురం బింతశృంగారించుటకుఁ గతంబేమియో చెప్పఁగలవా!

తెరలో

ఏమి! నీకుఁదెలియదా. ప్రతిగృహంబున నలంకరింపఁబడినదే.

మ॥ వినుమీ పంక్తిరథుండు జ్యేష్ఠసుతు నుర్వీనాథునింజేయఁగా
మనమందెంచెను పట్టభద్రుఁ డగుసుమ్మా రాముఁ డెల్లుండి, స
న్మునివర్యుల్ చనుదెంచినారు ఘనసమ్మోదంబు మీఱంగ, గా
రణమున్ గంటివె యీపురీవరమిటుల్ రాజిల్ల రామామణీ.

మంద—ఏమి శ్రీరామచంద్రున కెల్లుండి పట్టాభిషేకమహోత్సవమా. నవ్వో! సమయము దొరకినది. వెనుక శ్రీరాముం డొకసారి నన్నుఁ బరాభవించెను. అయ్యది తీర్చుకొనుటకు సమయమే దొరకలేదు. ఇప్పు డెట్లయిన రామపట్టా

భిషేకంబునకు భంగము గల్గించవలెను. అందుల కేమిసేయుదు. (ఆలోచించి) ఆలోచింపనేల ? కైకయొద్ద మటుమాయలంబన్ని యెట్లయినను భర్తను వశము జేసికొని భరతునకు బట్టంబుగట్టించునట్లు చేసెద. (మరల నాలోచించి) అయ్యో య్యో ! సద్గుణగరిష్ఠుండయిన శ్రీరాముని కెగ్గుదలంచుచుంటినే. దీనివలన నే నం దులాభ మేమి ? అట్లుగాదు. రాముం డరణ్యావాసముసల్ప జనునని యు దానం జేసి దానవసంహారము జరిగి భూభారంబు దగ్గునని యు, మాతాత నాతోం జెప్పి నాండు. కావున నే నిప్పుడు కైకం జేరి వెనుక శంబరాసురయుద్ధంబున దశర థుండు కైకకొసంగిన వరద్వయంబును గోరుమని చెప్పి యందు రాముని నరణ్యా వాసంబునకుం బంపుటకును, భరతుని రాజ్యాభిషిక్తునిజేయుటకును వేండుమని చె ప్పెద. అట్లుగాని దానవసంహారము జరుగదు. ఇంక నేను కైకం జేరెద. (నడచు చున్నది)

కైక—(ప్రవేశించి) ఏమి ! మందరా ! ఇంతరాత్రివేళ నరుదెంచితివి. మ రేమియుం తొందరలేదుకదా.

మంద—ఉదయంబునుండియు నిన్నుం జూడకుండుటచేత నామనం బెట్లో యున్నది. దానంజేసి యిప్పుడరుదెంచితిని గాని తొందర యేమియు లేదు.

కైక—ఏమికారణంబోకాని మొగంబు చిన్నబోయియున్నది.

మంద—దానికేమిగాని అమ్మా నీవీసంగతి వింటివా !

కైక—ఏసంగతి ?

మంద—శ్రీరామపట్టాభిషేకమహోత్సవము సంగతి.

కైక—(సంతోషముతో) ఏమేమి ! శ్రీరామపట్టాభిషేకమా ! ఎప్పుడు ?

మంద—ఎల్లుండి

కైక—మందరా ! ఎట్టిసంతోషవార్త తెలిపితివి ! నన్నానందవారాశిలో ముంచితివి. ఈసంతోషవార్త దెలిపినందుకు నిన్ను మెచ్చి యీపచ్చలహారం బిచ్చుచుంటి. గైకొనుము. (గళంబున నున్న హారంబు మందరకిచ్చుచున్నది.)

మంద—(హారమునుబారవేసి) ఆహా ! నీకిది సంతోషసమయముకాంబోలు. నీకు విపత్తు తటస్థించినదను సంగతి నీకుం దెలియకున్నది. ఇదియా నీతెలివి ! ఇన్నిదినంబుల నుండియు నీవు మహాజ్ఞానవంతురాలవని తలపోయుచుంటినిగాని యిట్లెన్నండు ను దలంపలేదు. సాతిబిడ్డండు రాజగుచుండగా సంతోషించుచుంటివా! రాజ్యం బు నలువురన్నదమ్ములకును నమ్మడిసొమ్మగుటచేత రామునివలన భరతునకు బ్రాణ భయంబుండును. లక్ష్మణుం డెప్పుడును రామునివిడనాడక సేవించుచుండునట్లు

శత్రుఘ్నుండును భరతుని సేవించుచుండును. నీపుత్రుని దలంచుకొన్న నాకు దుఃఖము పొరలిపొరలి వచ్చుచున్నది. ఆకౌసల్య యెంతపుణ్యముచేసెనో కదా. తనసుతుండు రాజగునని మిక్కిలి మురియుచున్నది. రాముండు రాజైనచో కౌసల్యకిరింద నీవు దాసివలెఁ జరింపవలసి వచ్చును. భరతుండు సేవకునివలె నుండును. కావున దీనికి నేదయిన తెరువు నాలోచించుకొనుము.

కైక — మందరా! నీవెంతయుఁ బొరఁబడితివి. ఆరఘురాముని గుణంబులు నీవెంతయుఁ గనుంగొనలేకపోతివి.

తే॥ గీ॥ జ్యేష్ఠసుతుఁడౌను నెంచఁగా ♦ శిష్ఠగుణుఁడు
తమ్ములందఱి నొకతీరు ♦ దయదలిర్ప
సంతసమ్మునఁ జూచెడి ♦ సత్వగుణుఁడు
రాముఁ డేలగాఁ దగఁడొకో ♦ రాజ్యరమను.

చ॥ భరతునికంటె నెక్కుడుగ ♦ భక్తినిబూని చరించు జానకీ
వరుఁడు తలంప నాయెడల ♦ భవ్యగుణాకరుఁ డాతఁడెన్నఁగా
ధరణిని నేలగాఁదగఁడె ♦ తమ్ములు నాతనిగొల్వఁజెల్లదే
భరతుఁడు నాతఁడుం మదిని ♦ భావనసేయఁగ నాకునొక్కటే.

మ॥ పరనారీ విముఖాంతరంగమున కా ♦ ప్రిష్ఠాదుఁడేయుంచు వే
దరహస్యార్థసమస్తశాస్త్రపరిశో♦ధాసక్తకౌతూహల
స్ఫురమేధానిధి కాబృహస్పతియె యం♦చుం బోల్తు రిద్ధాత్రి స
త్పురుషుల్ శ్రీరఘురాముసద్గుణుని సం♦తోషాత్ముని మందరా.

క॥ ఆడఁడసత్యము నెప్పుడు
వీడఁడు శరణన్నవారి ♦ బృథ్వీస్థలిలోఁ
గూడఁడు పరసతులనెప్పుడు
చేడెరో శ్రీరాముసెన్న ♦ శేషునితరమే.

కడుబాల్యంబునందే విశ్వామిత్రుని యజనంబు రక్షించి యహల్యాశాపంబు వాపి, శివధనుర్భంగంబు గావించి, జనకజను వివాహమాడిన ధీరపురుషుఁడు. తనతల్లియగు

కౌసల్యకంటెను నన్నెక్కుడుప్రేమతోఁ జూచు ధర్మమూర్తి. అట్టి రామచంద్రుఁడు పట్టాభిషిక్తుఁడగుచుండ సంతోషింపవలదా!

ఉ. ఆరఘురామమూర్తి నిఖిలావనినాథులు మోదమంద, నీ
ధారుణికెల్ల నాథుఁడయి ♦ ధర్మము తప్పక యేలుగాదె భూ
మీారమణుల్ నిరంతరము ♦ మేదురభక్తిని గొల్చుచుండ, నిం
పారఁ బ్రజాళిచిత్తముల ♦ నంచితసంతసమొంద మంథరా.

మంద—కైకా! ఎంతటిమూర్ఖురాలవైతివి! చాలుఁ జాలు. ఇంక నాప్రశంస గట్టిపెట్టుము. ఎవరికైనను రాజ్యంబు ప్రాప్తించగనే వెంటనే గర్వంబలవడును. రాముఁడు రాజైనపిదప భరతుని వనవాసిగనో లేక పరలోకవాసిగనో చేయఁగలఁడు. లక్ష్మణుం డెప్పుడును రాముని సేవించుచుండుటచేత నాతనికిఁ గీడుసేయఁదలపెట్టడు. నీపతి నీమాట కడుగుదాఁటడని గర్వించుచుందువు కాన నెట్లయినను భరతునకు రాజ్యాభిషేక మొనరించునట్లు చేయుట తగినకార్యము. ఇదినీకును, నీబంధుజనంబులకును, నాకును నానందము.

కైక—(ఆలోచించి) మందరా! నీవు చెప్పినమాట నిజమేనుమీ. ఇదంతయుఁ దెల్పినదానవు రాముని రాజ్యపదహీనునిగాఁ జేయుటకును, భరతుని రాజుగా నొనరించుటకును, దగిన యుపాయంబుగూడ నీవే వచింపుము.

మంద—అమ్మా! నీవు నావలన నెఱుంగఁదలంచి యడుగుచుంటివిగాని నీకుమాత్రము దెలియదా. అయినను నావలన వినుటకు నభిలషించుచుంటివిగానఁ దెల్పెదను. మున్ను శంబరాసురయుద్ధంబున నీనాథునకు సహాయంబొనరించినప్పు డాయన మెచ్చి నీకు రెండువరంబు లిచ్చియున్నాఁడు. అవి నీవింతవఱకును గైకొనియుండలేదు. ఆవరంబు లిప్పుడు గోరుము. మొదటివరంబు రాముని నరణ్యంబులయందుఁ బదునాల్గువత్సరంబులు వసియింపఁబంపుటయు రెండవది భరతుని రాజుగాఁజేయునట్లుగను కోరుము. రాజు నీయందు మిగుల ప్రేమగలవాఁడగుటచే నిందుకు దప్పక సమ్మతించును. ఇందుకు సందేహింపకుము. రాజువచ్చువేళయైనది. ఆయనవచ్చుసరికి గడుకోపముమాత్రము సూచించి పిదప మాటలసందడి నీవరంబులు గోరుము.

కైక—మందరా! నీ తెలివితేటలకు మెచ్చితి. నీవంటి ప్రాణసఖిని నే నెచ్చటను దిలకింపలేదు. చెలీ! వేయేటికి! రాజు వచ్చువేళయైనది. నే నిదే కోపగృహంబు జొచ్చెద. రాజు నావరంబులను దప్పక దీర్చునని నమ్మకమున్నది. లేదేని

నాచావైనను గన్నులారఁ జూచును. నీవే చూచెదవుగాక. రాముని రేపే య రణ్యాంబులకుఁ బంపునట్లు జేసెద. రాజుతో నెట్లు భాషించెదనో చాటుననుండి నీవే వీక్షింపుము.

మంద—మంచిది. (నిష్క్రమించుచున్నది)

[కైక భూషణంబులదీసివేసి యొకమూల ముసుఁగుదాల్చి పండియుండును]

[దశరథుఁడు ప్రవేశించుచున్నాఁడు]

దశ—(నలుదిక్కులు బరికించి)

తే॥ గీ॥ నన్నుఁ జూచినయంతనే ♦ వన్నెమీర
నెదురుగా వేగ నరుదెంచు ♦ ముదముతోడ
నిపుడు రాదేమి భావింప ♦ నేమికతమొ
రమ్యగుణగాత్రి కేకయ ♦ రాజపుత్రి॥

ఏమిచెప్పుదు! మందిరంబంతయుఁ జిన్నవోయియున్నది. దాసీజనంబైనను గనుపించుట లేదు. కైక నన్నాడించుట కిచ్చటనైన దాఁగియున్నదని తలంచెద. (నలుదిక్కులు బరికించి యొకమూల కైకం దిలకించి) ఏమిది భూషణంబుల నన్నియుఁ దీసివేసి యీమూల ముసుంగుదాల్చి శయనించుచున్నది. ఈమనుమారశరీర మిట్లు గాసిల్లఁజేయుట కేమి కారణమో కదా! ఇప్పుడు నే నీమెంజేరి యీమె కోపకారణ మారసెదఁగాక. (కైకంజేరి)

మత్తకోకిలవృత్తములు.

దశ—కోపమేటికి బూనినావిటు ♦ కోమలాంగిరో తెల్పుమీ
కైక—కోపమేటికి నేర్పైనను ♦ క్రోధమొందుకు భూధవా
దశ—ఓపడంతిరో భూషణంబుల ♦ నొల్చివేసితి వేటికే
కైక—భూపురందర యేటికిక శ్రమ♦బొందజేరెతి విచ్చటన్
దశ—గాసిజెందగ నేల యిట్టులు ♦ కామినీ యిఁక లెమ్మమీ
(అని లేవదీయఁ సెంచును)

కైక—ఆసజెందకు నన్ను ముట్టఁగ ♦ నాత్మలోపల నింకిటన్

దశ—వాసిమీయిటు జెప్పనెంచుట ♦ భామినీ సహియింపుమా

దోసమేమి యొనర్చియుంటినో ♦ తొయ్యలీ మదిదోఁచదే.

కైక—తే॥ గీ॥ చాలకష్టంబు బడితివి ♦ చాలుఁజాలు

కోసలేశ్వరుపుత్రిక ♦ కొంపఁజేర

నెంచుమింకిటనైనను ♦ నింతవరకె

యున్నయందుకె శ్రీమయయ్యె ♦ నుర్వీశేఁడ॥

దశ—

ఉ॥ నేరమునేమొనర్చితిని ♦ నీరజనేత్రిరో నీదుపట్ల, నీ

తీరునఁ బల్కెదేటికి మ♦దిన్ గడుఁ గోపముబూననేటికిన్

సారమతిన్ ననుంగనుము ♦ చల్లనిచూపునఁ జూడుమింక, నీ

వే రహిఁ గోపగించినను ♦ సీతఁడు తాళఁగలండె చెప్పుమా.

కైక—మీటక్కుటమారవిద్యలు నాయొద్దసాగిరావు.

ఉ॥ ప్రేమగలాడవంచును వి♦వేకగుణుండనటంచు మిమ్ములన్

నామదియందునెంచితి న♦నారతమున్ ముదమార; నిప్పుడున్

నీమదియంతయుందెలిసె ♦ నిక్కముదాఁపఁగ నేల చెప్పెదన్

భామిని మాయకాడు నిను ♦ బోలెడివానిని జూడనెచ్చటన్.

దశ—రమణీ! నేనేమి నీపట్ల నేరమొనరించితిని. కౌసల్యాసుమిత్రలకన్న నీయందుఁ బ్రేమాస్పదుండనై యుంటినన్న సంగతి నీకుఁ దెలిసియుండియు నాపై నేల కోపించెదవు? ప్రేయసీ! నామనం బారయుట కిట్లనుచుంటివో, లేక నాయం దేమైన దోషంబు గలుగుటచేతనే యిట్లనుచుంటివో యరయకుంటి.

తే॥ గీ॥ తప్పులుండిననాయెడ ♦ దయనుబూని

సంతసంబునసైరించి ♦ సరగనన్ను

బ్రోచిపాలింపు మిప్పుడు ♦ పొలఁతిమిన్న

యెందుకీ వృథాకోపంబు ♦ డెందమందు.

కైక—అసత్యమునకుఁ బాల్పడుచున్న మీమొగంబు జూడనొల్ల. రవికులజులు నిరంతర సత్యవాక్పరిపాలకులని ప్రసిద్ధిగలదుకాని యది మీపట్ల నున్న.

దశ—ఆ! ఏమంటివి!

మ॥ ఘనసామ్రాజ్యరమావిలాసవతి నన్ ♦ గాదంచుఁదాఁబోయినన్
దనయుల్ బాములు పెక్కుజెందినను నా♦తన్వంగులుంబాసినన్
పెనుబాముల్ బడనుండినన్ వినుము యు♦ర్వింబ్రాణముంబోయినన్
అనృతంబాడదు నాదుజిహ్వ గనుమీ ♦ యబ్జాతపత్రేక్షణా.

రాజ్యంబెల్ల ధర్మశాస్త్రవిధిం బాలింపుచు దీనరక్షణపరాయణత్వము కలిగి నిరంతరమును సత్యంబే పలుకుదునని కంకణముధరించి యున్న నన్నీరీతిని నీవు బల్కాడియా.

కైక—ఆనాఁడు శంబరాసురయుద్ధంబున మీకు నేను దోడ్పడినప్పుడు నాకు రెండు వరంబు లిచ్చియున్నారు. అవి మీకు జ్ఞాపకమున్నవా? లేక వరంబుల నీయలే దందురా?

దశ—నేనెప్పుడైనను నసత్యమాడితినా. నీకు వరంబు లిచ్చియేయుంటిని.

కైక—అవి నాకేల యింతకాలకును జెల్లించియుండలేదు?

దశ—నీవెప్పుడైనను నడిగియుంటివా?

కైక—నాకు జ్ఞప్తిలేకయున్నచో మీరును నట్లే సేయవలయునా?

దశ—కాంతామణీ! మఱచిపోతిని. ఇంతమాత్రంబున కీవలుగవలయునా!

కైక—పోనిండు దానికేమిగాని యిప్పుడు దయచేతురా?

దశ—నీకట్టిసందేహ మేలకలుగవలెను. ఈదశరథుండు మిన్నువైఁబడినను నసత్యమున కుఁ బాలుగాఁడని నీవెఱుంగవా?

కైక—మీరాలోచించుకొని చెప్పుడు. నే వరంబు లడిగినపిమ్మట నన్ను దూషించిన చోఁ బ్రయోజనములేదు.

దశ—(తనలో) ఏమిది; ఈనారీమణి యిట్లు పలుకుచున్నది. అలుకబూని యెట్టివ రంబుల నిమ్మని కోరునోకదా!

తే॥ గీ॥ కోసలేశ్వరుపుత్రిని ♦ దాసిగాఁగఁ
జేయుమంచునుగోరునో ♦ శిష్టజనులఁ
బట్టి శిక్షింపఁగోరునో ♦ మనమునందుఁ
దోఁచదెభ్భంగివేఁడునో ♦ తోయజాక్షి.

ఏమికోరినను నీయక తప్పదుగదా. (ప్రకాశముగా) సఖీ! నీవు సందియంబంద నేల ?
నీవరంబుల నీవు కోరుకొనవచ్చును.

కైక—కోరవచ్చునా ?

దశ—నిరాటంకముగా.

కైక—అట్లయినచో మొదటివరంబు శ్రీరామచంద్రుని వనంబులయందుఁ బదునాల్గేం డ్లుండఁబంపుటయు, రెండవది భరతుని నిఖిలభూచక్రంబునకును రాజుగాఁజేయుటయు, నీరెండువరంబులును ననుగ్రహించి సత్యవాక్పరిపాలకులుగండు.

దశ—హా! రామా! రామా! (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

కైక—అవా! ఈమహారాజు రాముని వనవాసంబును గూర్చి యడుగగనే మూర్ఛిల్లినాడే. ఏమైననుసరే. నాకోరిక నేను దీర్చుకొనవలెనుగదా.

దశ—(మూర్ఛదెలిసి రామునుద్దేశించి)

ఉ॥ హా! రవివంశభూషణ గుణాకర! హాజితచంద్రకీర్తి వి
స్తారతపఃఫలంబ సముదారగుణోదయ; సాధుదీనమం
దార! మదీయమూలధనమా! రఘురామ ధరాత్మజాధవా
ఘోరవనంబునుండఁగను కోమలిపంపునఁ బోయెదేకటా.

(కైకను విలోకించి)

శా॥ హా కైకా! సుగుణాలరాసివని నే నాత్మన్ సదామెంచియే
యాకౌసల్యసుమిత్రలం దలప కత్యంతానురాగుండనై
నీకున్ మేలునుగూర్తు నట్టియెడలన్ వీక్షింపకొక్కింత, నా
కాకుత్థ్సున్ వనికంప నిట్టులఘుగంగాఁ జెల్లునే కాంతరో.

కైక—నాథా! మీరిట్లుందురని మొదట తెలిసియుండియేకదా ముందు మిమ్మాలోచించుకొనుమని చెప్పితిని. నావలన నేమియు లోపంబులేదు. మీరు నన్నేమియు ననవలదు.

దశ—

చ॥ భరతునికన్న నిన్నెపుడు భక్తిమెయిన్ భజియించువాఁడు స
చ్చరితుఁడు తమ్ములందటిసి జక్కగసత్కృపఁజూచువాఁడు భా

సురసుగుణుండు సంతతము ♦ సూనృతమేవచియించువాఁడు నా
వరసుతుఁ డట్టిరాముని క♦పాయము దెచ్చుట జెల్లునే సతీ.

రమణీ ! కేకయరాజపుత్రి !

తే॥ గీ॥ ఎన్నఁడైన నను గాని నీ♦కింతయైన
నెగ్గు సేయంగఁ దలపెట్టి ♦ యెఱుఁగఁడతఁడు
కట్ట! యట్టినాసుతుని ను♦గ్రాటవులకుఁ
బంపుమంచును గోరెదే ♦ పడఁతిమిన్న.

తే॥ గీ॥ ముగుద యేల వృథాచల♦మున్ వహించి
యిట్లు గోరుట గోరుమిం♦కెద్దియైన
బ్రాణమిమ్మన్న నిచ్చెదఁ ♦ బంపఁజాల
రాఘవేంద్రు మత్సుతుని ను♦గ్రాటవులకు.

ఇట్టివరంబులు గోరుట నీ కానందమా ! ఇది యేమైన మహోత్సవమా ! జనవినుతి బడసెడి మహాత్కార్యమా ! అయ్యయ్యో! ఇట్టి వరంబులు గోరుటకు నీకు నోరెటులాడె.

కైక — ప్రాణేశ్వరా ! మిగిలిన దేమియును లేదు. వరంబులిచ్చుట మానివేయుఁడు. అట్లయినచో రాముని వనవాసంబునకుఁ బంపనవసరములేదు. భరతుని రాజుగాఁ జేయనక్కరలేదు.

దశ — ఏమీ! నన్నసత్యాలాపదోషంబునకుఁ బాల్పడుమందువా ! ఇదియా నీ చేయును సదుపదేశంబు.

కైక — అట్లుగాకున్నచో నావరంబులఁ జెల్లింపుడు.

దశ — తరుణీ ! నాప్రార్థనమాలకింపుము.

ఉ॥ ఆ రఘురాముబాసి తృటి♦యైన భరింపఁగఁజాలఁ బ్రాణముల్
హా రమణీ! కృపంగను ; త్వ♦దాత్మజునే ధరనేలనిత్తుఁ గా
నీ ; రఘురామచంద్రుని వ♦నిన్ వసియింపఁగఁ బంపఁజాల శం
పారుచిరాంగి సీత యెడ♦బాయునె నాథు నిమేషకాలమున్.

మఱియుఁ బ్రపంచంబంతయు నాకు రామునితోడనే యున్నది. రాముఁడే నాకు దైవము. రాముఁడే నాకుఁ దోడునీడ. వేయేల నాప్రాణంబులన్నియు నాతనితోడనే యున్నవి. ఆతనిని బాసి నే నొక్క త్రుటికాలంబైనను జీవింపనోఁప. కావున నాయందుఁ గృపాంతరంగవై రాముని వనవాసంబు తప్ప మఱియొండువరంబు గోరుకొమ్ము. అనేక ప్రశస్తనిస్తులవస్తునివహంబు దెమ్మన్న దెచ్చెద. కౌసల్యచే దాసితనంబు జేయింపుమన్నను జేయించెద. తుదకు నాప్రాణంబులిమ్మన్న నిచ్చెద. అంతియేకాని రాఘవుని వనంబులకుఁ బంపఁజాల.

కైక— నా కదియంతయు నేల. నావరంబుల జెల్లింపుడు.

దశ— రమణీ! నన్నుఁ గరుణింపవా! అయ్యయ్యో! రాముని నరణ్యములకుఁ బంపి నన్ను జంపఁదలంచుకొంటివా. అక్కటా! నేబ్రదికియుండుట నీకిష్టము లేదా.

కైక— నాథా! ఇదియంతయు నేల. రాముని వనవాసంబునకు మీరు శోకింప నేల? వరంబులీయ లేదని యొక్కమారు చెప్పినచో నిదియంతయు నక్కరలేదుకదా.

దశ— ఈజిహ్వతో నసత్యమాడఁజాల.

కైక— అట్లయినచో మీరింక సందేహింప నేల నావరంబుల జెల్లించి, దశరథుండు నిరంతర సత్యవ్రతాచారపారీణుఁడను యశంబును బ్రపంచంబున నందుఁడు.

దశ— ఆహా! ఎంత దాక్షిణ్యవిహీనవు.

తే॥ గీ॥ కేకయావనీశుఁడు గడు ♦ గీర్తిశాలి
యతని కెట్టుల జన్మించి ♦ యలరితీవు
ఇట్టి దానవటంచును ♦ నెఱిఁగియున్న
పెండ్లియాడుదునే నిన్నుఁ ♦ బృథ్వియందు.

అక్కటా! తెలియక మోసపోతిని. ధరణీమండలంబున నెక్కుడు స్త్రీ లుండిరికాని నీవంటిదాని నెచ్చటను జూడలేదు. ఎవ్వరైనను సొమ్ములడుగుదురు. భూముల గోరుదురు. తమవారికి భాగ్యంబులు కూర్ప వేఁడుదురు. కాని అయ్యయ్యో! ఇదియేమన్యాయము. జ్యేష్ఠసుతుని నరణ్యములకు బంపుమని కోరినవారి నెచ్చటను జూడలేదు. ఇట్టి పాపపుగోరిక గోరుటకు నీకే తోఁచెనో లేక యెవ్వరైనను జెప్పియుండిరో తెలియఁజాలకుంటి. రవివంశంబును మంటగల్పుటకే నిన్ను నేను బెండ్లిగూడితిని.

కైక— నాథా! ఏలమీరిట్లు వాపోవుదురు. మీరు వాగ్దానంబొసంగినరీతి నావరంబుల జెల్లించి సత్యవాక్పరిపాలకులగుఁడు.

ఆహా ! ఎంతపుణ్యాత్మురాలవు ! ఛీపాపిష్ఠికైకా ! నీముఖంబును జూచిన బంచమహాపాతకంబులు సంభవించును. (రామునుద్దేశించి) హా ! రామభద్రా ! సుగుణసముద్రా ! ఎన్నో యాగంబులనాచరించి, యెందఱికో దేవులకుమ్రొక్కి, ఎన్నోధర్మము లాచరించి నిన్నుఁ గంటిని. అయ్యో ! ఈపాపికైక నిన్ను వనవాసిగ జేయుమని యడిగినంతనే నాగుండెలు బ్రద్దలుగాక నిలిచియున్నవోయి ఈమాట నీకుఁ జెప్పుటకు నాకు నోరెట్లాడును. కుమారా ! వనవాసివయ్యెదవా రవికులదీపకా ! ప్రాణముల భరింపఁజాలనురా ! నాయనా !

(మూర్ఛిల్లుచున్నాఁడు)

(తెరవాలును)

ఇది ప్రథమాంకము.





# శ్రీరామప్రవాసము.

## ద్వితీయాంకము.

కైకమందిరము—దశరథుఁడు మూర్ఛిల్లియుండును రామ లక్ష్మణ సీతలు ప్రవేశించుచున్నారు.

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! శ్రీకైకమ్మగారి యాశీర్వచనం బందిపోఁదలంచి వచ్చితిమిగదా! ఏమిది! మందిరంబంతయు వెలవెలఁబోవుచున్నది. మనరాక నమ్మగారికిఁ దెలుపుటకుఁ బరిచారికాజనం బెవ్వరును గనుపింపకుండిరే. కానిమ్ము. మనమే లోపలికేగుదము. (అని యించుక నడచి మూర్ఛిల్లియున్న దశరథుని వీక్షించి) అదుగో నాయనగారచ్చట నిద్రించుచున్నట్లున్నారు. అల్లదే యాప్రక్క నమ్మగారుకూడ నిలచియున్నారు. కాని తండ్రిగారి మొగంబుమాత్రము విన్నబోయినట్లున్నది. ఇందుకుఁగారణంబు తల్లినడుగుదము. (కైకం జేరి)

తే॥ గీ॥ ప్రొద్దుపోయెను నెంతయో ♦ భూధవుండు
నిదురలేవంగ లేదేమి ♦ నేఁడు ; దేహ
మందు సౌఖ్యంబుగనునెకా ♦ యమ్మఁ చెపుమ
కారణంబేమియిట్లుండఁ ♦ గరుణబూని.

శా॥ నన్నుంజూచినతోడనే కరుణతో ♦ నారాఘవాగ్రమణీ
యన్నా మత్సుత వచ్చితేయనుచు న♦త్యంతప్రమోదమ్ముతోఁ
జెన్నారంజనుదెంచి ; మ్రొక్కఁగను నా♦శీర్వాదమిచ్చుంగదా
మన్నీఁడేటికిలేవ డింతవఱ క♦మ్మా చెప్పుమీ మ్రొక్కెదన్.

(కైకకు మ్రొక్కుచున్నాఁడు)

కైక—కుమారా! రాఘవా! మీతండ్రిగారు సుఖంబుగ నేయున్నవారు. ఏకారణంబు చేతనోకాని నిదురనుండి యింకను లేవలేదు.

రాము—(తండ్రిని సమీపించి) అమ్మా! నీవుచెప్పుటకు సందేహించి యున్నను మంటివి గాని చూడుము.

తే॥ గీ॥ కనులబాష్పజలంబులు ♦ గాల్వగట్టఁ
గ బుచుండెను చూడుమీ ♦ కారణంబు
జెప్పనందాక గడుపులోఁ ♦ జేయివెట్టి
కలఁచినట్లుండె చెప్పుమీ ♦ కరుణబూని.

తల్లీ! మాజనకునకుఁగోపమువచ్చెడు కార్యము మేమెవ్వరము నేజేసియుండలేదుకదా. నాయందేమియు నాయనకాగ్రహంబు లేదుకదా.

కైక—నాయనా! రామభద్రా! నీపితృభక్తి సర్వరెఱుంగరు. నీవేమియు నాయనపట్ల వ్యతిరిక్తమయినకార్యము సేయలేదు. ఆయననీపై నాగ్రహము చెందియుండుటయు లేదు.

రాము—అమ్మా! అట్లయినచో నేను గడుధన్యుండనే. కాని యిట్లుచింతనొందుచు నివ్విజెందియుండుటకుఁగారణమేమి?

కైక—వారట్లుండుటకుఁ గారణంబును నీతోఁజెప్పలేక యట్లుపరుండియున్నవారు.

రాము—చెప్పఁదగినదేని నాయందు దయఁబూని నీవాకారణంబును జెప్పి నాసంతాపము బాపరాదా!

కైక—పుత్రకా! ఆకారణంబు నీకుమరింతసంతాపంబును గలుగఁజేయునదేకాని సంతాపము బాపునదికాదు.

రాము—అమ్మా! అదియెట్టిదో సెలవీయుము.

కైకె—నాయనా! రామభద్రా! మున్ను శంబరాసురయుద్ధంబున మీతండ్రిగారికి నేనుదోడ్పడినప్పుడు నాకురెండువరంబులిచ్చియున్నారు. అవి నేనిప్పుడిమ్మనికోరితిని. అందులకు సత్యవాక్యపరిపాలకుండగు భవజ్జనకుండు సమ్మతించె. అందు మొదటివరంబు భరతుని రాజుగాజేయుటయు, రెండవది నిన్నుఁ బదునాల్గవత్సరము లరణ్యంబున వసింపఁబంపుటయు. ఆకారణంబున నీతండ్రిగారు ఇసంబులకుఁ బొమ్మని నీకుఁజెప్పఁజాలక యిట్లు మూర్ఛిల్లియున్నారు.

రాము—(నవ్వి) ఇదియా మాతండ్రికి సంతాపకారణము.

ఉ॥ నీకువరంబు లీయ నవ ♦ నీశ్వరుఁడు వాటినినీవుగోరుటల్
ప్రాకటరీతియౌనుగద ♦ భావమునం దలపోసిచూడఁగా
నాకునుజెల్లుగాదొకొ ఘ♦నంబుగమీఁదగునానతిన్ గొనన్
వే కరుణింపుమింక నట ♦ వీస్థలిజేరెదఁ గోర్కెతీరఁగన్.

అమ్మా ! ఇందు దండ్రి సంతాపమందవలసినయవసరం బేమియు లేదు. ఆయన నీకు వరం బులిచ్చిరి. నీవు కోరితివి త్వదభీష్టంబుదీర్చుటయు, దండ్రిసత్యంబు గాపాడుట యు నాకు విధియైయున్నది. తల్లీ ! ఇదియేన నాకు సంతాపమంటివి. మీ యభీష్టంబుదీర్చుట నాకు సంతాపమా. ఎంతమాటపలికితివి. త్వదాజ్ఞమౌళిపైఁ దాల్చి యరణ్యంబులఁ బదునాల్గువత్సరంబులును సుఖంబుగజరించివచ్చెద. భర తుండు నిఖిలభూచక్రంబునకును బట్టాభిషిక్తుఁడగును. ఇందుకు నీవుగాని తం డ్రిగారుగాని సందియంబంద నవసరములేదు.

కైక — లోకంబునఁ బుత్రులందఱును బుత్రులుగారు. నీవేపుత్రుండవు.

రాము — తల్లీ ! జననీజనకుల యభీష్టంబుదీర్పనిపుత్రులజన్మ మెందుకు?

లక్ష్మ — (కోపముతో) అన్నయ్యా ! ఆమెచెప్పుటకును నీవువినుటకును సరిపోయినది. ఇంకనేమివినవలయును. సంగతియంతయుఁ దెలిసినదికదా !

చ॥ తనసుతు రాజుజేయుటకు ♦ ధారుణినాథువరంబులిమ్మనన్
మనమునసించుకైన నను ♦ మానముబూనక నీయఁజెల్లునే
వనితయునిట్లు నిన్ను వన♦వాసముసేయఁగఁబంపనెంచుటల్
గనఁగ ననూయకాదెయిది♦కాంచుముచిత్తమునన్ రఘూత్తమా.

కైకకోరినను నిట్టివరంబులాకోరుట. రాజు తనమాటవినునుగదాయని నీకు నపకారముసే యనెంచుటపాడియా దీనివలన నామెవడయులాభమేమి ? అవును లాభము లేకేమి ? తనసుతుఁడు రాజ్యమేలుననుసంతోషముచాలదా. ఒకవేళ భరతుఁడు రాజైన నగుఁగాక నిన్నువనంబులకుఁబంపించుమనికోరనేల. ఇదియుంగాక యె ప్పుడో శంబరాసురయుద్ధంబునం దండ్రిగారికీమె తోడ్పడినదఁట. ఈమెప్ర తాపంబున కీయనమెచ్చి రెండువరంబులిచ్చినాడఁట. ఆవరంబుల సంగతి యీ యనకును నామెకునుగాక మరెవ్వరికిఁదెలియును. ఇట్టివరంబులకు, రాజును న్యాయాన్యాయములఁజూడకుండనే సమ్మతించెను, భళిరా ! ఏమిచక్కగను న్నది.

రాము—తమ్ముఁడా! నీకిసిరేమివెఱ్ఱి. ఎవ్వరిపై నాగ్రహించెదవు. తండ్రిగారు వరంబులిచ్చిరి. అమ్మగారుగోరిరి. తండ్రిగారిసత్యంబుగాపాడుట నాకునధికదా! ఎందుకిట్టిపలుకులుబలికెదవు?

లక్ష్మ—(కోపముతో) నిన్నటిదినంబున సకలరాజన్యసమక్షంబున నిన్ను బట్టభద్రునిగాఁజేసెదననిపలికి యిప్పుడీరీతిఁ బలుకవచ్చునా. మీకుసమ్మతమేమోకాని నాకుమాత్రముకాదు.

మ॥ భరతుండెవ్వఁడు కైకయెవ్వతె మహీ♦భాగంబుచాలింపఁ బం
క్తిరథుండెవ్వఁడు నీకునిచ్చుటకు న♦ర్థింజూడు చిత్తం... నక్
సారిదిక్ తద్వ్యతిరేకులౌ కుమతులక్ ♦ సాక్షించి దివేవేగమే
ధరణీశాగ్రణిగాఁగఁ జేసెదనినుక్ ♦ దథ్యంబుగా సోదరా.

(అని దశరథునిమీఁదికిబోవుచుండగా రాముఁడు వారించి)

రాము—అనుజా! నీకుఁబిచ్చిపట్టినదా గ్రహంబేమైన సోఁకినదా. గురుజనతిరస్కారంబుగూడదనుధర్మశాస్త్రము నీకుఁదెలియదా.

మ॥ అగుఁగాక సతి నీకుఁ దల్లి మరి యు♦ద్యత్కీర్తి తేజుండితం
డగుఁగాదేజనకుండు పేరియెడ వా♦హా చెల్లునే నీకిటుల్
పగసాధింపఁగనెంచఁ జిత్తమున ద♦ర్పంబిప్డుచూపింతువే
నగరేలోకులు నీదుచర్యలకునుక్ ♦ నామాటలాలింపుమీ.

తే॥ గీ॥ పరమదుర్మార్గుఁడితఁడు ♦ భవ్యగుణుల
దల్లిదండ్రులఁజంపంగఁ ♦ దలఁచెననుచు
నఖిలజనులాడు నిందవా♦క్యములకీవు
పాలుగానెంచియుంటివే ♦ భావమందు.

ఇంకనీగురుజనతిరస్కారంబు చాలించి శాంతిఁజెందియూరకుండుము.

లక్ష్మ- ఆ॥ గీ॥ భవ్యయాజ్ఞనునీవీయ ♦ వహాళిఁదాల్చి
యూరకుండవలసెఁగాక ♦ యూరకున్న

ఉ॥ నీకువరంబు లీయ నవ ♦ నీశుఁడు వాటినినీవుగోరుటల్
ప్రకటరీతియౌనుగద ♦ భావమునం దలపోసిచూడఁగా
నాకునుజెల్లుగాదొకొ ఘ♦నంబుగమీఁదగునానతిన్ గొనన్
వే కరుణింపుమింక నట ♦ నీస్థలిజేరెదఁ గోర్కెతీరఁగన్.

అమ్మా! ఇందు దండ్రి సంతాపమందవలసినయవసరం బేమియు లేదు. ఆయన నీకు వరంబులిచ్చిరి. నీవు కోరితివి త్వదభీష్టంబుదీర్చుటయు, దండ్రిసత్యంబుగాపాడుటయు నాకు విధియైయున్నది. తల్లీ! ఇదియేన నాకు సంతాపమంటివి. మీయభీష్టంబుదీర్చుట నాకు సంతాపమా. ఎంతమాటపలికితివి. త్వదాజ్ఞమౌళిపైఁ దాల్చి యరణ్యంబులఁ బదునాల్గువత్సరంబులును సుఖంబుగజరించివచ్చెద. భరతుండు నిఖిలభూచక్రంబునకును బట్టాభిషిక్తుఁడగును. ఇందుకు నీవుగాని తండ్రిగారుగాని సందియంబంద నవసరములేదు.

కైక—లోకంబునఁ బుత్రులందఱును బుత్రులుగారు. నీవేపుత్రుండవు.

రాము—తల్లీ! జననీజనకుల యభీష్టంబుదీర్పనిపుత్రులజన్మ మెందుకు?

లక్ష్మ—(కోపముతో) అన్నయ్యా! ఆమెచెప్పుటకును నీవువినుటకును సరిపోయినది. ఇంకనేమివినవలయును. సంగతియంతయుఁ దెలిసినదికదా!

చ॥ తనసుతు రాజుజేయుటకు ♦ ధారుణినాధువరంబులిమ్మనన్
మనమునసించుకైన నను ♦ మానముబూనక నీయఁజెల్లునే
వనితయునిట్లు నిన్ను వన♦వాసముసేయఁగఁబంపనెంచుటల్
గనఁగ నసూయకాదెయిది♦కాంచుముచిత్తమునన్ రఘూత్తమా.

కైకకోరినను నిట్టివరంబులాకోరుట. రాజు తనమాటవినునుగదాయని నీకు నపకారముసేయనెంచుటపాడియా దీనివలన నామెవడయులాభమేమి? అవును లాభములేకేమి? తనసుతుఁడు రాజ్యమేలుననుసంతోషముచాలదా. ఒకవేళ భరతుఁడు రాజైన నగుఁగాక నిన్నువనంబులకుఁబంపింపుమనికోరనేల; ఇదియుంగాక యెప్పుడో శంబరాసురయుద్ధంబునం దండ్రిగారికీమె తోడ్పడినదఁట. ఈమె ప్రతాపంబునకీయన మెచ్చి రెండువరంబులిచ్చినాడఁట. ఆవరంబుల సంగతి యీయనకును నామెకునుగాక మరెవ్వరికిఁదెలియును. ఇట్టివరంబులకు, రాజును న్యాయాన్యాయములఁజూడకుండనే సమ్మతించెను, భళిరా! ఏమిచక్కగనున్నది.

రాము—తమ్ముఁడా! నీకిదియేమివెఱ్ఱి. ఎవ్వరిపై నాగ్రహించెదవు. తండ్రిగారు వరంబులిచ్చిరి. అమ్మగారుగోరిరి. తండ్రిగారిసత్యంబుగాపాడుట నాకువిధికదా! ఎందుకిట్టిపలుకుబలికెదవు?

లక్ష్మ—(కోపముతో) నిన్నటిదినంబున సకలరాజన్యసమక్షంబున నిన్ను బట్టభద్రునిగాఁజేసెదనని పలికి యిప్పుడీరీతిఁ బలుకవచ్చునా. మీకుసమ్మతమేమోకాని నాకుమాత్రముకాదు.

మ॥ భరతుం డెవ్వఁడు కైకయెవ్వతె మహీ♦భాగంబు బాలింపఁ బం
క్తిరథుం డెవ్వఁడు నీకునిచ్చుటకు న♦ర్థింజూడు చిత్తం[illegible]నన్
పొరిదిన్ తద్వ్యతిరేకులౌ కుమతులన్ ♦ పొక్కించివేవేగమే
ధరణీశాగ్రణిగాఁగఁ జేసెదనినున్ ♦ దథ్యంబుగా సోదరా.

(అని దశరథునిమీఁదకిబోవుచుండఁగా రాముఁడు వారించి)

రాము—అనుజా! నీకుఁబిచ్చిపట్టినదా గ్రహంబేమైన సోఁకినదా. గురుజనతిరస్కారంబుగూడదనుధర్మశాస్త్రము నీకుఁదెలియదా.

మ॥ అగుఁగైకాసతి నీకుఁ దల్లి మరి యు♦ద్యత్కీర్తితేజుండితం
డగుఁగా దేజనకుండు వీరియెడ వా♦హా చెల్లునే నీకిటుల్
పగసాధింపఁగనెంచఁ జిత్తమున ద♦ర్పంబిప్డుచూపింతువే
నగరేలోకులు నీదుచర్యలకునున్ ♦ నామాటలాలింపుమీ.

తే॥ గీ॥ పరమదుర్మార్గుఁడీతఁడు ♦ భవ్యగుణుల
దల్లిదండ్రులఁజంపంగఁ ♦ దలఁచెననుచు
నఖిలజనులాడు నిందవా♦క్యములకిప్పు
పాలుగానెంచియుంటివే ♦ భావమందు.

ఇంకనీగురుజనతిరస్కారంబు చాలించి శాంతిఁజెందియూరకుండుము.

లక్ష్మ— ఆ॥ గీ॥ భవ్యయాజ్ఞనునీవీయ ♦ మాళిఁదాల్చి
యూరకుండవలసెఁగాక ♦ యూరకున్న

యలఘుకోపిష్ఠియాతఁడ ♦ న్యాయమైన
కార్యమీరీతి నిప్పుడు ♦ కనులఁజూచి.

దశ—(మూర్ఛదెలిసి)

మ॥ అవివేకుండ నసత్యవాదిని మహా♦యజ్ఞానుఁడన్ పాపసం
భవుఁడన్ మోహవశుండ నీచుఁడను దు♦ర్భావుండ దుర్మార్గుఁడన్
రవివంశంబును బాడుసేయుటకునై ♦ ప్రావిర్భవంబొందితిన్
భవుకప్రీతిని నన్నుఁజంపుము వెసన్ ♦ భావింపకన్ లక్ష్మణా.

రాము—(తండ్రి నిబట్టుకొని)

మ॥ జనకా యేటికి నిట్టిసాహసము నీ♦సౌమిత్రి కోపంబుచే
నని నేవోపలుభాష లందులకు నీ♦వత్యంతచింతంబడన్
జనునేయిట్టులు సైపుమయ్య యతనిన్ ♦ జ్ఞానంబులేకుంటచే
ననెనీరీతిని లేనిచో ననునె నీ♦వాత్మన్ విలోకింపుమా.

లక్ష్మ—(దశరథునిజేరి పాదంబులపైఁబడి)

శా॥ ఈవిశ్వంభరకున్ మహేశ్వరునిగా ♦ నీరాఘవగ్రామణిన్
నీవెల్లుండియొనర్చువాఁడనని మా♦నీంద్రల్ వినంజెప్పి యయా
హా! వాసంబునుసేయ రాము వనికే ♦ పంపించుమీాయంచు నే
నేవేవో పలుభాష లాడితిని దం♦డ్రీ నన్నుసైరింపవే.

తే॥ గీ॥ తెలియకీరీతినాడితి ♦ బలువిధముల
నన్నుగోపింపఁగానాత్మ ♦ యందెశాంతి
తండ్రి! సైరించిరక్షింపు ♦ దయదలిర్ప
మ్రొక్కుచుంటిని మఱియింత♦మ్రొక్కుచుంటి.

దశ—లక్ష్మణా! నీయందొక్కింతయుఁ లోపంబులేదు. లోపంబంతయూ నాయదియే. ఇట్టిపాపాత్ముని, జడమతిని, పాపరతని, మోహాంధుని వధించినను, పాపంబుసంభ

**వింపదు** నీవింక సంశయింపక శీఘ్రంబుగ నీఖడ్గంబున నాతలఁ ద్రెళ్ళనేసి పుణ్యముఁగట్టికొమ్ము.

లక్ష్మ—తండ్రీ! నేనెంతపాపినా!

రాము—జనకా! మీరింక మనంబున విచారంబుదక్కుఁడు. సర్వంబును కైకమ్మగారివలన వినియుంటిని. తమసత్యంబు గాపాడుట నాకు విధియైయున్నది,

ఉ॥ కాన ద్వదాజ్ఞఁబూనుచును ♦ కాననమందు వసింపఁబోయెదన్
మానసమందుఁజింతిలుట ♦ భావ్యముగా దిఁక ముద్దుతమ్మునిన్
మానుగ రాజుఁజేయుము స♦మంచితలీలల దల్లికోరికల్
బూనియొనర్ప నెంచుటది పో ♦ గను భాగ్యము నాకు నెంచఁగన్.

దశ—నాయనా! రాఘవా! ఈదురాత్మురాలిని బెండ్లియాడుటంజేసి **నా**కెట్టిదురవస్థ సంభవించెనురా!

తే॥ గీ॥ నిన్ను వనికంపుమంచును ♦ నీరజాక్షి
కోరఁగా విని చిత్తంబు ♦ కొంకక! పగుల
కుండె వేవ్రక్కలౌచును ♦ కుతలమందు
రాయికాఁబోలు నియ్యది ♦ రాఘవేంద్ర.

(కైకంజూచి) ఓసీ! దుర్మతీ! ఇట్టికోరికంగోరి యింకనునీవు నాయెదుటనిల్చియుంటివా. సమస్తసద్గుణాఢ్యుండగు శ్రీరామచంద్రునికెగ్గుదలంచుచున్న నీముఖంబు జూడరాదు. దూరముగానుండుము.

ఉ॥ నేరమొకింత లేని రమ♦ణీమణి తల్లిని దూరనేటికిన్
సారమతిన్ ననుంగనుము ♦ సత్యమె నిల్పుకొనంగ నెంచు మీం
పారఁగ ఘోరకానన ము♦లందు వసింపఁగఁబోయి వత్తు ధా
త్రీరమ నెల్లనేలునిఁక ♦ శ్రీకరుఁడా భరతుండు ప్రీతితోన్.

దశ—తండ్రీ! రఘునందనా! జ్యేష్ఠసుతుండవు నీవుండఁగా భరతుఁడా రాజగుట. ఎంతకష్ట మెంతకష్టము. ఛీ! (లక్ష్మణుంజూచి)

మ॥ వరపుత్రున్ రఘురాము ఘోరవనికిం ♦ బంపించి యాపైన, న
భ్భరతున్ రాజును జేయుగా నడిగె నీ♦భామామణింగూల్చెదన్
సరగన్ దెమ్ము మదాజ్ఞపై ననిపుడే ♦ శాతాసినిన్ లక్ష్మణా

(అని కైకమీఁదికిఁబోవుచుండఁగా రాముఁడడ్డగించి

రాము—ధరణీశుండవు ధర్మవంతుఁడ విదే♦ధర్మంబా యోచింపుమా.

తండ్రీ! ఎట్టిఘోరకార్యంబుసేయ నెంచితిరి? మాతల్లిగారినిఁ వధించి పాపంబుగట్టికొనఁ దలంచితిరా!

తే॥ గీ కాంతఁజంపె దశరథభూ♦కాంతుఁడంచు
ఘోరనిందకుఁబాల్పడఁ♦గోర్కెఁబుట్టె
నా మనంబునఁగాకున్న ♦ నాదుతల్లి
నిట్లువధియింపనెంచుట ♦ కేమికతము.

దశ—అయ్యో! కుమారా! ఎవ్వరైన నిట్టివరంబులుగోరిరా! ఈచండాలికే యిట్టి కోర్కెబుట్టెను. లోకంబున సనతులు లేరా! సవతిసుతులు లేరా!

కైక—కుమారా! రాఘవా! నన్నుఁజంపుటకువచ్చు మీతండ్రిగారినడ్డుపెట్టితివేల? రానిమ్ము. నన్నుజంపి పుణ్యముగట్టుకొననిమ్ము. నేనుకడతేరినచో నీవు వనంబుల కేగనక్కరలేదు. భరతుని రాజుజేయనక్కరలేదు. ఇదంతయు నేల? వరంబులు చెల్లింపనవసరంబుండదుకదా. ఇంతకును నాయనకరుణించిన వరంబులు నేను గోరుటచేత నేకదా యాగ్రహమువచ్చినది. పోనిమ్ము. ఇంతశ్రమయేల. వరంబులు చెల్లింపకపోయినచో నెవ్వరేమందురు.

రాము—తల్లీ! నీవుగూడ నాయనవలెఁ దొందరజెందినచో నేమనఁగలవాఁడ. పుత్రమోహంబునంజేసి యట్లనెను గాని యిచ్చినవరంబులను ద్రిప్పువాఁడుకాడు. రవివంశంబునఁబుట్టినవారు ప్రాణంబులుబోవుపట్లనైనను నసత్యమాడరని తెలియుము. అమ్మా! నీవుసందియంబందవలదు. తండ్రిగారి యానతింగైకొని భవదాజ్ఞావర్తినై వనంబులయందుఁ బదునాల్గువత్సరంబులును జరింపనేగెదను,

దశ—నాయనా! వనంబులకేగ నిశ్చయించితివా!

చ॥ కొడుకులు లేరు లేరనుచుఁ ♦ గొందలమందియు నెట్టులో భుపిక
బడసితిమిమ్ము నందఱును ♦ భవ్యగుణాకర పెద్దవీవు ; హా
యడవులవాసమున్ సలుప ♦ నంచితరీతిని నీవుపోయినక
బుడమిని నాదుజీవములు ♦ బోవె తలంపఁగ రాఘవాగ్రణీ.

తండ్రీ! నిలచినను, కూర్చుచున్నను, నిద్రించుచుండినను మేల్కొనియున్నను, నెవ్వరితో నైన సంభాషించుచుండినను, నొక్కండ నేయుండినను నీనామస్మరణంబు దక్క నామనంబున నితరంబుండదుగదా. అయ్యో! నీవు వనంబులకేగినచో నేనెట్లు జీవంబుల భరించియుండఁగలను. నన్నుఁగూడ నీవెంటఁగొనిపొమ్ము.

రాము—తండ్రీ! నీవు పుత్రమోహంబునం జేసి యిట్లు వక్కాణింపుచుంటివి. నాకు వనంబుల కేగుటకు ననుమతి యొసంగి సత్యవాక్పరిపాలకుండవు గమ్ము.

మ॥ నినురాజాగ్రణిగా నొనర్చి మదిలో ♦ నే హర్షముం బొందుదం
చును వీక్షించితిగాని యిట్టులగునం ♦ చుక నేరనైతిక మదిక
తనయా యేమనువాఁడ గ్రూరమతినై ♦ తన్వంగి నిన్నక్కటా
వనికిక బంపుమటంచుఁ గోరెనుగదా ♦ ప్రారబ్ధమేమందురా.

కుమారా! అస్మదీయ సత్యవాక్యంబు బరిపాలించుటకు నీవు వనంబులకరుగుదువు. నీవరిగినపిమ్మట, నాప్రాణంబులు నిల్వవు. ఇదె సత్యము.

రాము—తండ్రీ! సహజధైర్యశాలివగు నీవిట్లు చింతించుట పాడిగాదు. ఇంక నాకు వనంబుల కేగ నాజ్ఞనిమ్ము.

సీత—(రామునింజూచి) మనోహరా! మీరు వనంబులకేగుటకు నిశ్చయించితిరా.

రాము—తండ్రియాజ్ఞ నవశ్యము దీర్చవలయునుగదా. ఇందుకు సందియంబేమున్నది?

తే॥ గీ॥ అత్తలగు మువ్వురకు నీవు ♦ హర్షమెసఁగ
సేవసేయుచునుండుమీ ♦ చిగురుబోఁడి
వనములక బదునాల్గేండ్లు ♦ వరుసగడపి
సత్వరంబుగ నేతెంతు ♦ చారుగాత్రి.

సీత—ఆహా! ఎట్టిమాటసెలవిచ్చితిరి. మీరువనవాసంబు సేయఁబోవుచుండఁగా నేనింటి కడ సుఖంబుగా మెలంగుచుంటినా? అట్లెన్నఁటికిని దలంపకుఁడు. తమరెచ్చ

టనున్న నేను సునచ్చలనే యుందును గాని మిమ్ముం బాసి యొక్కత్రుటికాలం బైనను నుండుదానను గాను. కావున నన్నుఁగూడఁ దమవెంటఁ దోడ్కొనిపొండు.

రామ—రమణీ! ఎట్టికోరికగోరితివి ?

సీ॥ వనవిహారము కాదు ♦ వారిజాక్షి రొ చూడ
చండవనమయభూ♦సమితిగాని
ఆరూఢమధురపి♦కారవంబులుగావు
క్రూరజంతునిచయ ♦ ఘోషగాని
సరససంగీతమే ♦ జాడగలుగఁబోదు
భయదరాక్షసలోక ♦ మయముగాని
కడుపారభుజియింప ♦ గల్గవు భక్ష్యముల్
అమితమౌ కందమూ♦లములెగాని

తే॥ గీ॥ అకట సుకుమారదేహివై ♦ యలరునీవు
ఘోరవనవాసమును సేయఁ ♦ గోర్కెఁబుట్టె
నందులకు నచ్చెరువుపుట్టె ♦ డెందమందు
చాలుఁజాలునునీకోర్కె ♦ జలజనేత్రి.

సీత— నాథా! ఎట్టిఘోరారణ్యావాసంబు సేయుచుండినను మీయండనుంటి నేని నాకది సౌఖ్యంబే. వేయేల? మీరు నన్నుఁగొనిపోవనిచో నాకు మరణమే శరణము.

రాము—అబలా! అరణ్యవాసమునల్ప నీకు నిష్టమే హాయని యట్లంటినిగాని, నీ కట్టి కోరికయున్నచో నావెంటరమ్ము.

దశ—(కైకనుద్దేశించి)

ఉ॥ హా! జగడాలమారి కయి ♦ కా ముదమందుచునున్న దాన వా
హా! జనకావనీశ సుత ♦ యైతనరారుచు నాకుఁగోడలై
పూజితసచ్చరిత్రియను ♦ హా ల్పైసలారెడిసీతనిప్పుడీ
రాజితరూపు వెంటను న♦రణ్యములన్ జరయింపఁబంపు దే.

(జానకింజూచి) అమ్మా!

తే॥ గీ॥ ఎట్టివారలయింటను ♦ బుట్టనేమి
ఎట్టివ్రతములఁ జేయుచు ♦ నెగడనేమి
ఎట్టిదానములఁ జేయుచు ♦ నెగడనేమి
ధాతచేయుందు సత్కృప ♦ తాల్పఁడయ్యె.

లక్ష్మ—(రామునితో) అన్నయ్యా! మీయిరువురును మీదారినిజూచుకొనిరి.

శా॥ అన్నా సందియమేల; నామనవి నీ♦వాలింపుమీ క్రమ్మక్కర్
నిన్నుంగొల్చుచువచ్చెదర్ వినుము నే ♦ నిన్నాయఁగాఁజాల; సం
పన్నత్వంబునుబాసియున్నపురిలో ♦ వాసంబునుంజేయఁగా
హృన్నీరేజము సమ్మతింపదునుమీ ♦ పృథ్వీశ్వరా సోదరా.

అన్నా! నీవు నన్నుంగొనిపోవనిచో నాదారి నేను జూచుకొనెద. ప్రాణములత్యజించుట
యే నాదారి.

రాము—తమ్ముఁడా! ఏమి! నీపిచ్చి! భరతునిగొల్చుచునుండ రాదా!

లక్ష్మ—అన్నా! నిన్నుబాసి తృటికాలంబైనను బ్రతుకఁజాల.

రాము—అట్లైన నీయభీష్టంబును దీర్చికొనుము.

దశ—అయ్యో!

ఉ॥ భూమిని సర్వసంపదలు ♦ పూజ్యులబంధులనెల్లబాసి; శ్రీ
రాముఁడు లక్ష్మణుంగలసి ♦ రమ్యచరిత్ర సుశీలసాధ్వి; యా
భామనుగూడియేగునిఁక ♦ బాపపుగ్రక్కకతంబునం గటా
రామునిబాసి యేటికిటు ♦ ప్రాణముదాల్పఁగనెంతుఁ జిత్తమా.

(ఇంచుకయూరకుండి) సుమంతా!

సుమంతుఁడు—(ప్రవేశించి) ఏమిసెలవు?

దశ—రామ లక్ష్మణ సీత లరణ్యంబులకేగుచుండిరి. సమస్తసైన్యంబులును, సంపదలును
నాతనివెంటఁబంపుము.

కైక — అట్లువలనుపడదు. మీరుమువ్వురును నాయెదుట నారబట్టలుగట్టికొని యరణ్యంబులకేగవలయును.

దశ — హా! ఎంతకష్టమెంతకష్టము. చూడఁజాల. చూడఁజాల. (అనిమూర్ఛిల్లుచున్నాఁడు)

రామ — (కైకతో) తల్లీ! భవదిష్టప్రకారము నారబట్టలదాల్చియేపోవుదుము. కృపవహించియిప్పింపుడు.

కైక — (నిష్క్రమించి వెంటనేప్రవేశించి నారబట్టలనీయఁగా రామ లక్ష్మణ సీతలు ధరింతురు.)

రామ — తమ్ముఁడా! ఇంకమనమేగి కౌసల్యాసుమిత్రాంబల యనుజ్ఞవడసి, వనంబులకేగుదము. (సుమంతునిజూచి) సుమంతా! రథముసిద్ధముసేయుము. (కైకంజూచి) తల్లీ! ఇఁకమాకనుజ్ఞనిమ్ము.

కైక — నాయనా! రాఘవేంద్రా! నీధర్మతత్పరతయే నిన్ను రక్షించుఁగాక.

లక్ష్మ — తల్లీ! అన్నగారివెంట నరిగివచ్చెద.

కైక — సోదరభక్తిగల నీకు శుభంబగుఁగాక.

సీత — అత్తగారూ! నాథుంగొల్చుచు నేగివచ్చెద.

కైక — అమ్మాయీ! జానకీ, అరణ్యంబులయందు గడుజాగరూకతతో మెలంగుచుండుము.

(అందఱును నిష్క్రమించుచున్నారు.)

ఇది ద్వితీయాంకము.





# శ్రీరామప్రవాసము.

## తృతీయాంకము.

### రంగము—గంగాతీరము.

[ రామలక్ష్మణసీతలు, సుమంతుఁడు ప్రవేశించుచున్నారు. ]

రాము—నే నెందులకును విచారింపను గాని మన మరుదెంచునప్పుడు శోకంబును బట్టఁజాలక చింతించిన తండ్రిగారిం దలంచిన నాకు దుఃఖంబు పొరలిపొరలి వచ్చుచున్నది. ఆతండ్రిగారు మనరథంబును వెంటాడించుచు.

శా॥ ఓరామా! ననుఁబాసి ఘోరవనిలో ♦ నుండంగనీవేగుదే
యేరీతిన్ భరియింతు జీవములనే ♦ నిచ్చోట ; హాసారథీ
తేరుందోలకుమయ్య నాపుముత్రటిన్ ♦ ధీవర్యునిం రామునిన్
జేరన్ వచ్చెదనన్న తండ్రికొఱకై ♦ చింతింతుఁ జిత్తంబునన్.

దీనికిఁగారణంబు నేనేకదా!

సుమం—కుమారా! నీ వెట్లగుదువు! కేకయరాజనందన కదా యిందుకు గారణంబు.

రాము—పాప మామె యేమిచేసినది?

తే॥ గీ॥ ఆమెకరుణచేతనుగాదె ♦ యఖిలమునులు
వాసమునుసేయునట్టి సద్భవ్యవనము
పావనంబైనగంగాప్రవాహ మెలమి
గనులకింపుగాఁ జూడఁగఁ ♦ గలిగెమనకు.

లక్ష్మ—అన్నయ్యా! ఇంతకును మీశాంతమే యింతవఱకును దెచ్చినది.

సీత—అబ్బా! సూర్యభగవానుం డాకాశంబునఁ దనవేఁడికిరణాళిని బూర్తిగాఁ బ్రసరిం పఁజేయుచున్నాఁడు.

రాము—(జానికింజూచి)

మ॥ జనకక్ష్మాధవచంద్రుకూర్మిసుతవై ♦ సర్వంసహామండలీ
ఘనదోఃపీఠినిఁదాల్చునాదశరథ ♦ క్ష్మాభర్తకీ వెంతయో
యనుఁగుంగోడలవై తలంపఁగను నా♦కర్థాంగివై యక్కటా
వనసంచారముసేయఁగావలసెఁగా ♦ ప్రాణేశ్వరీ జానకీ.

సీ॥ పరిచారికాజనుల్ ♦ నిరతంబుసేవింప
వరలుచుండుదువుకదా ♦ పడఁతిమిన్న
ఉద్యానవనమందు ♦ నొప్పుగాఁదిరుగుచుఁ
జెలఁగుచుండుదువుకదా ♦ చిగురుఁబోఁడి
మహనీయమణిమయ ♦ మందిరంబులయందు
వసియించెదవుకదా ♦ వారిజాక్షి
హంసతూలికపాన్పు ♦ సందునశయనించి
యలరుచుండుదువుకదా ♦ లలితచరిత
తే॥ గీ॥ అట్టిసౌఖ్యంబులనుబాసి ♦ యకట నీవు
నన్నుఁగూడి యరుగుదెంచి ♦ వన్నెదొరఁగి
పడఁగలేనట్టికష్టముల్ ♦ పడుచునుంట
యెట్లులోర్వంగఁగలుగుదు ♦ నిప్పుడబల.

సీత—సీ॥ పతితోడనున్నప్డు ♦ భయదమ్రుగంబులే
ఘనపరిచారికా ♦ జనములౌను
ప్రాణేశ్వరునితోడ ♦ వనవాసమైనను
నుద్యానవనమాచు ♦ నొప్పుచుండు
కోమలాంగునివెంట ♦ కొండలందుండిన
మందిరంబులెయగుచుఁ ♦ బరఁగుచుండు

హృదయనాథునిగూడి ♦ నేలపైఁబండిన
తల్పంబెయగాఁచును ♦ దనరుచుండు.

తే॥ గీ॥ ప్రాణనాథునితోనుండి ♦ పడుచునున్న
కష్టమంతయు మిగులసు♦ఖంబె యగును
పతిని సేవించివరలెడి ♦ పడఁతి కెపుడు
రమ్యగుణసాంద్ర శ్రీరఘు ♦ రామచంద్ర.

నాథా ! మీచెంగటనుండి నేఁ బడుచున్న కష్టంబులన్నియు నాకు సుఖంబులే. మీరు నన్నుఁగూర్చి యావంతయుఁ జింతింపవలదు.

మ॥ జగతీనాథులు పెక్కుమంది ముదిత ♦ స్వాతంబుతో నెప్పుడున్
మిగులన్ బూజలు సేయుచుండఁగను నీ♦పృథ్వీతలంబేలఁగాఁ
దగునీవే యిటురాగ నిన్ గొలుచుచున్ ♦ రా మాకుసంతోషమే
వగపేరీతిని బొందువారలము భా♦వంబందుఁ బ్రాణేశ్వరా.

సుమం—(తనలో) ఆహా ! ఏమి. ఈజానకీదేవి సదయహృదయము. తన్నుం గూర్చి చింతజెందు శ్రీరాముని కిట్టివాక్యములఁ జెప్పి సంతాపమార్చుచున్నది. అక్కటా ! వీరి కిట్టియిక్కట్లు రాజిల్లెనే. (కైకనుద్దేశించి)

తే॥ గీ॥ ఎంతకార్యంబుగావించి ♦ యెగడినావు
పాపమంచును నెంచక ♦ పాపరహితు
రాము రామయుక్తముగను ♦ గ్రీటవులకు
వాసమునుసేయఁబంపితే ♦ పాపి కైక.

ఓ ! కేకయ రాజనందనా ! దీనివలన నీ వందులాభ మేమియున్నది ? లోకంబునఁ గైక యిట్టి దుష్కార్యంబుజేసెనన్న దుర్యశంబుతప్ప మరియొండు లేదుకదా. అయ్యో ! ఏమి నావెఱ్ఱి ! ఆమె నననేల ? ఇదియంతయు దశరథునియందే యున్నది.

తే॥ గీ॥ ఎఱిఁగియో యెఱుఁగకనో తా♦నిట్టివరము
ప్రియఁగాఁగోరుగాకను ♦ నింతి కైక

కోరినంతనె దశరథ ♦ కువలయేశుఁ
డేలసమ్మతించెను వీరి ♦ నిట్లుబంప.

ఏమిది! నే నజ్ఞానాబ్ధిలోఁ బడితినే. దశరథుండు మాత్ర మేమిచేసెను?

తే॥ గీ॥ ధాతలిఖియించె నీరీతి ♦ ధరణికులుని
జాయతో వనవాసంబు ♦ సల్పుమంచు
దానిదప్పింపనెవ్వారి ♦ తరము; మనుజు
లనఁగనెంత యాతనివ్రాఁత ♦ కష్టపడఁగ.

ఇంతకును ధాతవిధించినప్రకారము జరగక మానదు. ఆహా! రామలక్ష్మణసీతలను జూచిన నాకు దుఃఖము పొంగిపొంగియే వచ్చుచున్నది.

చ॥ తనయులులేరు లేరనుచుఁ ♦ దద్దయుఁబూజలు సల్పిసల్పి స
జ్జననుతిపాత్రులన్ సుగుణ ♦ సాంద్రుల నల్వురఁగాంచియెవ్వడున్
గనులకువత్తులట్లుగను ♦ గాంచెడిపంక్తిరథుండె యక్కటా
వనములలోవసింపఁగను ♦ బంపెనువీరలనంచుఁ గుందెదన్.

ఎండలోఁ జనుదెంచుటంజేసి వీరి ముఖంబులన్నియు గాంతితఱఁగి వాఁడియున్నవి. ఎండకన్నను వానకన్నను నెఱుంగని వీరికిముం దెట్లు ఘోరకాననవాసంబును సల్పుదురోకదా.

రాము—సుమంతా! ఏదియో విచారించుచున్న ట్లున్నావు.

సుమం—నాయనా! రామభద్రా!

మ॥ ధరణీపాలురుభక్తిమ్రొక్కఁగను సప్తద్వీపభూచక్రమున్
బరిపాలించెడివాఁడవౌదువని నేభావంబునం దెంచఁగాఁ
జిరభాగ్యంబును రాజ్యమున్ విడిచి శ్రీసీతామహాదేవియున్
వరసౌమిత్రియువెంటరా వనములన్ ♦ వాసంబునుం జేయఁగా
నరుదేరన్; విధివ్రాఁతయంచునిరతం ♦ బాత్మన్ విచారించెదన్.

రాము—సుమంతా! ఎంతవెఱ్ఱివాఁడవు!

చం॥ జనకునిసత్యమున్నిలుప ♦ జాయయుఁదమ్ముఁడు వెంటరాఁగ నీ
వనముల గొన్నివర్షములు ♦ వాసముసేయఁగవచ్చె రాముఁడం
చును ముదిమందకెట్టులను ♦ చోద్యముగావిలపించెదేల ; నీ
మనమున; జాలుఁజాలునిఁక ♦ మానుగధైర్యము బూనుమొప్పఁగన్.

సుమం—సహజధైర్యశాలివగు నీ వట్లనక మరి యెట్లందువు. నీకిట్టిస్థితి ప్రాప్తించినందుకు నీకుఁ జింతలేదుగాని, నాబోంట్లకుఁ జింతలేదా. నీసుగుణంబులు వర్ణించుచు నిన్నుఁ బాయలేక నీవెంటఁ బడి యెంతయోదవ్వుగుదెంచిన పురజనుల దుఃఖంబును నీవు చూచితివికదా.

రాము—సుమంతా! నీవు నాయందుఁగల్గు ప్రేమచే నట్లు వక్కాణించుచుంటివి. అది యట్లుండనిమ్ము. తండ్రిగారి సత్యంబు గాపాడ నిట్లువచ్చుట లోకశ్లాఘ్యమైన కార్యమేకదా!

సుమం—(సీతంజూచి) తల్లీ! జనకరాజపుత్రీ! పరిచారికాజనంబులు నిరంతరంబును గొలువ రత్నసౌధంబులయందు విరాజిల్లు నీకిట్టిస్థితి సంభవించెనమ్మా!

సీత—సుమంతా! శ్రీరామసన్నిధానమునఁ బడు కష్టంబులన్నియు సుఖంబులేసుమీ.

సుమం—(లక్ష్మణునిజూచి)

తే॥ గీ॥ ఎపుడుకోపమేగాని యిం♦కెఱుఁగవేమి
వెట్టివాఁడవునాయనా ♦ విడిచియుండఁ
జాలకేరీతిరాముని ♦ చరణయుగము
భక్తితోడ సేవించుచు ♦ వచ్చితీవు.

లక్ష్మ—సుమంతా! అన్నగారన్న సాక్షాద్విష్ణుమూర్తియేకదా.

చం॥ సరసిజసంభవాదిసుర ♦ సంఘకిరీటవినూత్న రత్నసం
స్ఫురితమరీచిజాలపరి ♦ పూరితపాదసరోజ యుగ్ముఁడై
వరలు మదీయసోదరుని ♦ భవ్యతరంబుగ సేవజేయు చీ
కరణిని నేనువచ్చుటది ♦ కాంచఁగ నాదగుపూర్వపుణ్యమే.

సుమం—తండ్రీ! నీ వెంతయు ధన్యుండవు!

రాము—(అందఱినిజూచి) ప్రేయసీ ! లక్ష్మణా ! సుమంతా ! చూడుఁడు.

సీ॥ ఆద్యంతరహితుఁడై ♦ యలరారు హరిపాదాం
భోజంబులెంచంగ ♦ బుట్టినిల్లు
సకలజనోద్భాసి ♦ సౌందర్యవాగాసి
వారణాసీపురి ♦ వాసభూమి
పార్వతీవల్లభు ♦ మకుటాగ్రరంగ త్ప్రి
దేశంబు నాట్యంపు ♦ దివ్యసీమ
స్నానమాడినయంత ♦ సర్వపాపంబులఁ
బోద్రోలనెంచుట ♦ భూరిగుణము

తే॥ గీ॥ అట్టిపరమపావనమౌచు ♦ నలరుగంగ
జూడుడీ మదికిమిగుల ♦ జోద్యముగను
గనులపండువయగుచును ♦ గ్రాలుచుండె
దాటబోదమురండింక ♦ దానినిపుడు.

సుమం—(తనలో) రాముండు గంగను దాఁటుదమని చెప్పినంతనే నాప్రాణంబు లెగిరి
పోవుచున్నవి. ఇంక నీశేఁడు నన్ను సాకేతంబునకు మరలి పొమ్మనును
గాఁబోలు.

తే॥ గీ॥ రమ్యగుణశీలుఁడైన శ్రీ♦రామభద్రు
జానకీయుతంబుగను నీ♦కాననముల
డించిపోవంగ నేరీతి ♦ నెంచఁగలవు
చిత్తమా ! నీకు లేదొక్కో ♦ చింతయకట.

ఒక వేళ రాముండు నన్నుఁ బొమ్మన్నచో నాతనిని వేఁడికొని యెట్లయినను నాతనింగొ
ల్చుచుఁ బోయెదను.

(అందఱును నడచుచున్నారు)

లక్ష్మ—అన్నయ్యా ! మనముగంగను సమీపించినాము.

తే॥ గీ॥ స్నానమాడినయంతనే ♦ సకలమునులు
సురలుపావనత్వముగాంచి ♦ శోభగాంతు
రెందు ; నట్టిగంగానది ♦ నిపుడుకాంచ
గల్గితిమి మనకన్నుల ♦ కఱవుదీర.

(అందఱును గంగను సమీపించుచున్నారు.)

[ గుహుఁడును నిరువురు సేవకులును బ్రవేశించుచున్నారు. ]

సేవ—ఈరెవరుబాబో. సూడ్డానికి మాబయమేత్తుంది.

గుహు—ఎఱ్ఱిమొగాల్లాలా ! భయమెందుకేసి. ఈరెవరో గొప్పోరులాగున్నారు. కనుక్కుందాము రండరో ! (రామాదులంజేరి) ఎవరు బాయినా మీరు. ఈయడవుల్లోకి వచ్చారు !

సుమం—నిషాదా ! వీరి నెఱుంగవా ?

గుహు—(పరిశీలించి) ఈరెవరో నాకు తెల్సిలేదుగాని నీవు సుమంతయ్యవు కావటయ్యా !

సుమం—అవును. నీవు దశరథభూపాలుని నెఱుంగుదువుకదా,

గుహు—అయ్యబాబో ! ఆమారాజును యెఱుగనోరెవరున్నారు. ఆయనకు నన్నుసూస్తే పాణంతో సమానముగా సూసకొంటాడు. ఆచక్రవర్తికి నేను శిస్తు చెల్లించడంలేదూ.

సుమం—(రామలక్ష్మణసీతలను వేరువేరుగఁ జూపుచు)

ఉ॥ ఈతఁడు రాముఁ డాదశర ♦ థేశునిజ్యేష్ఠసుతుండు చూడుమీ
ఈతఁడులక్ష్మణుం డతని ♦ కెంతయుఁగూర్చెడిసోదరుండు నీ
వ్రాతచరిత్ర యాజనక ♦ భూపతిముద్దులకూఁతురైన శ్రీ
సీత, సుశీలురామునకుఁ ♦ జెన్నలరారెడిభార్యయేసుమీ.

గుహు—మఱిచిపోయినానుగాని యీరెండరినెఱుఁగుదునయ్యా ! ఈరక్విమిధిలాపురం పెళ్లికై అయోధ్యకు వచ్చినప్పుడు నేను చూచినప్ప, తేనెయొయ్యన్ని కానుకలు పట్టాలేదంటయ్యా !

సుమం—ఇఁకనేమి. అందఱును నీవెఱిఁగినవారే.

గుహు—(సేవకులంజూచి) ఓరే ! ఈరుమనఃపభువులురా ! రామయ్యా గారిపాదాలికి మొక్కండోసి

(గుహుఁడును తక్కిన నిషాదులును రామునిపాదంబులకు మొ్రొక్కుచున్నారు)

గుహు—పెబువులురావడంనేత మేమంతా పావనమైనాము అయ్యా ! రామయ్యాతండ్రీ. బాబూ ; లచ్చుమయ్యా ! తల్లీ ! సీతమ్మా ! ఎండదాకి మొగాలువాడినాయి. ఈసెట్టునీడకు దయసేయండి.

(అందఱును వృక్షమునీడకు జేరుచున్నారు)

గుహు—(రామునిజూచి) నాయినా ! రామయ్యా ; చాలాదుకుమారులు మీరు యీయరణ్యాలకెందుకొచ్చారు బాబూ సీతమ్మతల్లినిగూడ రయెంటేసుకొచ్చారు. అయ్యో ! ఇదేంటయ్యా కిరీటం బుజకీర్తులు వదిలేశాగేమి. మునివేసాలుదాల్చినారు !

రాము—నిషాదా !

తే॥ గీ॥ తండ్రిసత్యంబుగాపాడ • దరుణిగూడి
తమ్ముఁడును వెంటరాగ నీ • మన్నుతోడ
వనములందున వసియింప • వచ్చినాము
తపసివేషంబులను నిట్లు • దాల్చినాము.

గుహు—అవేంటిబాబూ తండ్రిగారిసత్యంబుగాపాడడమేంటి.

సుమం—నిషాదా ! కైకాదేవిగారిని నెఱుంగుదవుగదా. దశరథమహారాజుగారామె కిదివఱకు రెండువరంబులిచ్చియున్నారు. ఆకారణంబున నమ్మహాదేవి యావరంబులనిప్పుడిమ్మనికోరెను. అందు మొదటివరంబు భరతుని రాజుగాజేయుమనియు, రెండవది రాముని నరణ్యంబులయందుఁ బదునాల్గువత్సరములు వసియింపఁబంపుటయు, దానంజేసి సత్యవాక్పరిపాలనంబునకై యీరామచంద్రుండు వనంబులకరుగ, దశరథుండు సమ్మతించె. అదియే వీరిరాకకుఁగారణంబు.

గుహు—దశరదమారాజుగూడా కైకమ్మగారిమాటయినీ రామయ్యాగారిని వనాలికి బంపడానికి యొప్పుకున్నాడటయ్యా ! భార్యమాటంటే అంతతీపికామోను. (రామునింజూచి) ఓరామ్యబాబూ ! ఇంకంతా తెలిసింది. ఇంకమీరింకొక్కడుగైనా ముందుకెళ్ళొద్దు. అయ్యోద్యకేమురలండి. నేను మీతో నామూకను దీసికొనివత్తాను. భరతయ్యా రాజ్యమెల్లా యేల్తాడోచూస్తాను.

రాము—నిషాదా! నీవట్లనవలదు. తండ్రిసత్యంబుగాపాడుటయే నాకుఁ బరమధర్మంబు. నీకు మాయందున్న భక్తికి మెచ్చితిని. ఇంక మేమిప్పు డీగంగానదిని దరింపవలయును. కావున మాయందు గృపవహించి నావనుసిద్ధము సేయుము.

గుహు—అయ్యాబాబో! మీరడవులో కిపోతూంటే నేను సూస్తూయూరకుండగలనా. పోనీనాయినా! మాపల్లెరాజ్యంబు బాలిస్తూ సక్కంగా మమ్మల్నిరక్షిస్తూ యిక్కడుండండి. మేముమీపాదాలికి సేవచేస్తూవుంటాము. మీకేమి యభ్యంతరములేదు.

రాము—నిషాదనాథా! నీకారుణ్యమునకు స్వాంతంబున మిగులసంతసించితిని. రాజ్యంబుతోఁగాని, సౌఖ్యభోగంబులతోఁగాని, నాకేమియుఁబనిలేదు. తండ్రిగారి సత్యవాక్యంబు బరిపాలించుటయే నాకు ముఖ్యము. ఇంకనీవు మారుపలుకక నావను సిద్ధముజేసి గంగానదిందాఁటింపుము.

గుహు—మీరల్లాసెలవిస్తే నేనేంసేస్తాను. సిత్తంబాబూ నావతీస్కొస్తాను (నిష్క్రమించుచున్నాఁడు)

రాము—(సుమంతునిజూచి) సుమంతా!

ఉ॥ మాయెడబ్రేమచేత నను ♦ మానముబూనకొకింతయైన నీ
వీయెడ దేరుదోలుకొని ♦ యింతటిదూరమునచ్చినావు భూ
నాయకుఁడంపగానిటు; మఱనంబుననిప్పుడునిన్ను నేనెడం
బాయగ బుద్ధిపుట్టదిఁకఁ ♦ బాయకతప్పదు నేమిచెప్పదున్.

అయ్యా! సుమంతా! మాయందుండుప్రేమచేఁ గడుదూరంబు శ్రమపడివచ్చితివి. ఇంక మేము గంగానదిందాఁటి యవతలకుబోవుదుము. కావున నీవిచ్చటనుండి రథంబును మరలించుకొని పురంబున కేగుము.

సుమం—నాయనా! రామభద్రా! నిన్నీఘోరారణ్యంబున విడిచి యేరీతిని బోవఁగలుగుదును.

తే॥ గీ॥ ఎత్తిపెంచితినిన్ను నే ♦ నెంతయైన
వలువయంతయుబురదయౌ ♦ భాతిఁజక్క
బెట్టుకొనిచరియించితి ♦ బ్రేమతోడ
అక్కటానిన్ను బాసి యెట్లుఱుగువాడ.

అయ్యో ! ఎచ్చునప్పుడు మీయందఱిని రథముపైఁ బెట్టికొనివచ్చి, యిప్పుడు శూన్యరథంబుతో నేనేరీతిని నయోధ్యకుంజొత్తు. రాఘవేంద్రా ! నిశ్చయముగా నిన్నెడఁబాసిపోవఁజాల. నిన్ను సేవించుచు నరుదెంచుటకు లక్ష్మణునితోపాటు నాకుఁగూడ ననుమతినీయుము.

రాము—సుమంతా ! నీకీవిచారమేల? తండ్రియాజ్ఞాప్రకారము పదునాల్గువత్సరంబులును నరణ్యంబునఁ ద్వరలోఁగడపివచ్చెదను. మాయందుండు ప్రేమచే నీవట్లుచింతించుచుంటివి. నిన్ను బాయుటకును మాకుఁ జిత్తంబు సమ్మతింపకున్నది. కాని విధియాజ్ఞ యనుల్లంఘ్యనీయముకదా. ఇంకనీవు విచారంబుదక్కి పురంబునకేగి, మాకై మిక్కిలిపరితాపమందు తండ్రిగారికి ధైర్యంబు జెప్పుచుండుము.

సుమం—అయ్యో ! రఘునందనా ! దీపములేనిమందిరముభాతి దనరుచున్న యాయయోధ్యనెట్లుబ్రవేసింతు. తండ్రీ ! నన్నుఁగూడ నీవెంటఁగొనిపొమ్ము. నీచరణదాస్యముసేయుచు వచ్చెద.

రాము—ఇంక నీవు చింతింపక ధైర్యంబునుదాల్చి పురంబునకేగుము.

తే॥ గీ॥ గంగదాఁటితిమంచు నా ♦ కమ్మతోడ
నమ్మగావచియింపుమీ ♦ నెమ్మినీవు
మాకునై చింతనొందెడి ♦ మాకళత్రు
ధైర్యవంతునిజేయుమీ ♦ దయదలిర్ప.

మాతల్లులు మువ్వురకును నమస్కార మాచరించితినని చెప్పుము.

లక్ష్మ—అయ్యో ! సుమంతా ! కైకమ్మగారు మమ్ములను నమ్మదురో నమ్మరో గంగానదిందాఁటించివచ్చితినని చెప్పుము. మరియు మాతల్లిసుమిత్రాదేవితోడ,

తే॥ గీ॥ నీదునాజ్ఞను మౌళిపై ♦ నెమ్మిదాల్చి
జానకీనాయకునిపాద ♦ సరసిజముల
భక్తిమీరసేవింపుచు ♦ వరలుచుండె
లక్ష్మణుఁడటంచుఁ జెప్పు మాహ్లాదమెసఁగ॥

మాతండ్రికిని దల్లులకు నమస్కారములని చెప్పుము.

సీత—సుమంతా ! మువ్వురత్తలకును మామగారికిని నమస్కారమాచరించితినని చెప్పుము.

సుమం—ఆహా! మిమ్ముఁబాసిపోవుటకు నాకుఁ గాళ్ళురాకయున్నవి.

గుహు—(ప్రవేశించి) బాబూ! నావసిద్ధముచేసినాను.

రాము—ఇదిగో! వచ్చుచున్నాము (సుమంతునిజూచి)

ఉ॥ కాననమున్ వసింపగను ♦ గామినితోడను నేగితంచునుఁ
మానసమందుఁ జింతిలక ♦ మాటికి మాటికి; నింకధైర్యముం
బూనుమటంచు జెప్పు పరి ♦ పూర్ణకృపారసమూనుచున్ సుమం
తా! నినునమ్మియుండెదము ♦ తండ్రిని గూర్చిమనంబులందునన్.

ఇంక నీవేగుము మేముపోయివచ్చెదము.

సుమం—(కన్నులనీరుగార్చుచు) తండ్రిలారా! మిమ్మెడబాయనలసివచ్చినందులకెంత యో చింతించుచున్నాఁడ. నీయాజ్ఞదప్పరాదని పోవుచుంటి. నాయనా! రాఘువేంద్రా! తండ్రిసత్యవాక్యంబు బరిపాలింపఁదలంచి యరణ్యంబులకేతెంచిన నీవు పదునాల్గువత్సరంబులనుగడపి సుఖివై సాకేతంబున కేతెంచెదవు. అరణ్యావాసంబుసలిపి మీరేతెంచుసరికి సుమంతుండుండునో యుండడోకదా. ఒక్కసారి మిమ్ముఁగౌఁగిలించుకొననిండు. (రామలక్ష్మణుల గౌఁగిలించుకొనుచున్నాఁడు.)

రాము—సుమంతా! ఇంకవిచారంబుదక్కి నీవేగుము. లక్ష్మణా! సీతా రండు.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది తృతీయాంకము.







# శ్రీరామప్రవాసము.

## చతుర్థాంకము.

కైకమందిరము—ప్రవేశము కైక, భరతుఁడు

భర—హా! పాపీ! ఎంత దుష్కార్యంబాచరించితివి. నీమూలంబున సూర్యవంశంబున కెల్ల దుర్యశంబు సంభవించెనే,

తే॥ గీ॥ రమ్యగుణధాము రాము న ♦ రణ్యమునకుఁ
బంపి సూర్యవంశంబును ♦ బాడుసేయ
భూమియందుఁబుట్టితివి కాఁ ♦ బోలు నీవు
కేకయావనీంద్రునకు దు ♦ ష్కీర్తిఁగొలుప.

అయ్యో! ఎంతకార్యం బాచరించితివి. నిన్నుఁ దనతల్లికంటె నెక్కుడు ప్రేమతోఁ జూచు శ్రీరామునకా యెగ్గుసల్పితివి. అమ్మహాత్మునకు నాయందున్న వాత్సల్యముగూడ తగ్గునట్లు చేసితివి. పాపం బాతఁడు దీనికంతకును గారణంబు నేనే యని యెంతకోపంబును స్వాంతంబునఁ జెందెనో కదా. అక్కటా! సోదరవత్సలుండగు మాయన్న కరణ్యావాసంబుగతి గల్పించితివా! ఛీ! దుష్టబుద్ధీ! నీముఖంబుజూచినఁ బంచమహాపాతకంబులు సంభవించును. ఓసీ! ఎంతపాపంబున కొడిగట్టుకొంటివి.

ఉ॥ రాముని దేవసన్నిభు న ♦ రణ్యములన్ జరియింపఁబంపి, సు
త్రామనిభుండు తండ్రినిటు ♦ ధారుణి బాయఁగఁజేసినావుగా
గోముఖపుండరీకగతిఁ ♦ గోమలివైతివి నాదుతండ్రికిన్
భామిని నిన్నుఁ జంపినను ♦ బొందదు పాపమువేయునేటికిన్,

అయ్యో! ఇట్టి పరమఘండాలివని తెలియక మాతండ్రి నిన్నుఁ జేపట్టి మోసపోయెను గదా. నిరంతరంబును ధర్మంబుదప్పక పాలించు నాతండ్రిమృతికి నీవేకదా కారణంబు. ఓసీ! పాపీ! ఆరామచంద్రుని యరణ్యావాసంబును గూర్చి యాతఁడెట్లుచింతించెనోకదా. అన్నా! ప్రాణములబోవుపట్ల నాప్రియజనకుండు రామునికై యెంత విలపించెనోకదా. ఎండకన్నును వానకన్నును నెఱుంగక శుద్ధాంతసౌధంబులయందు వసింపుచు సౌఖ్యంబందు సీతామహాదేవి కట్టి యిక్కట్లు గల్పించితివి. అన్నగారి పదంబుల సేవింపుచు వెంటనేగు భాగ్యంబు లక్ష్మణునకు లభించెను. రామలక్ష్మణసీతలులేని యీయయోధ్య నెత్తిని గట్టుకొనఁ దలంచితివా? ఆరామునికై జనంబు లెట్లు విలపించుచుండిరో చూడుము. పాపీ! ఇట్టివరంబులు కోరుమని నీకెవ్వ రుపదేశించిరి. (ఇంచుకయూరకుండి దశరథునుద్దేశించి) హా! తండ్రీ దశరథభూపాలా! నాపైన నీవేమి యనుమానముందితివోకదా. ఈకైక యిట్లు గోరుననియు, రాముఁడిట్లు వనంబుల కేగుననియుఁ దెలిసియుండినచో నేను నందిగ్రామమున కేగక యుందునుగదా. జనకా! దుర్మార్గురాలగు నాతల్లివలన నీవెట్లు వంచింపఁబడితివి. అయ్యో! రామవియోగంబునఁ బ్రాణంబులఁబాసి మమ్మందఱను వీడిపోయితివా? అయ్యో! ఇట్టి తుచ్ఛవరంబులుగోరిన నాతల్లిని నీవేల సైరించి యూరకొంటివి. ఖడ్గంబున కెఱయిచ్చియుండినచో బాగుండునుగదా. అవును. సత్యవాగ్వ్రతుండవగు నీవిట్టికార్య మేల చేయుదువు?

కైక——కుమారా! శాంతివహించి యొక్కింత నాపలుకు లాలింపుము. గతించినదానికి నీవిట్లు చింతింపకుము. ఎఱింగియో యెఱుంగకనో యిట్లాచరించితిని. నలువురిలో నన్నల్లరిబెట్టక రాజ్యంబు నేలుకొనుము.

భర——ఛీ! పాపీ! ఇంకను సిగ్గులేక నాతో సంభాషింపుచుంటివా. నన్ను రాజ్యం బేలుమని బోధించుమంటివా! ఔరా! ఎంతసాహసము. మాయన్నగారులేని యీరాజ్యంబు నేను బాలింతునా! నేనును రామచంద్రుఁ డెచ్చటనుండెనో కనుఁగొని యాతని చరణంబులు సేవింపుచు నేనును నచ్చటనేయుండెద.

—తెరలో—

కుమారా! భరతా! నీవేల సందియంబందెదవు? మీతల్లిగారు చెప్పినప్రకారము రాజ్యంబుబాలింపుము. నీవేలుదువనియేకదా యామె యింత ఘనకార్యము చేసినది, ఆమె యభీష్టం బేల చెల్లింపకుందువు?

భర—ఆహా! కౌసల్యామహాదేవి యెట్లుపలుకుచున్నదో కంటివా! ఈమెపలుకులు నా హృదయంబునకు బాణంబులకంటె నెక్కుడు తీవ్రతరంబుగఁ దగులుచున్నవి కదా. ఓసీ! పాపిష్ఠికైకా! నీవు నాపాలిఁటి మృత్యుదేవతవు గాని తల్లివిగావు. నీవు జంతుహింసనాచరించు కటికవాని గర్భంబునఁ బుట్టవలసినదానవు గాని రాజకులంబునఁ బ్రాదుర్భవంబందవలసినదానవు కావు. నిన్ను ఖడ్గానికి బలియిచ్చినచో లోకంబులెల్ల నిట్టి దుష్కార్యంబాచరించిన యువతి చచ్చెనని సంతసింతురు. దుష్టాత్మురాలా కాచికొమ్ము. ఈవ్రేటున నీతల ఖండించెదను. (అని యొరనుండి ఖడ్గమును దీయుచున్నాఁడు)

శత్రుఘ్నుఁడు—(తొందరగాఁ బ్రవేశించి. భరతుని జేయిఁబట్టుకొని)

తే॥ గీ॥ తాళు తాళుము సోదరా ♦ తల్లిఁజంపి
పాపమేటికిఁ గట్టుకో ♦ భావమందుఁ
దలఁచినాఁడవు నీరీతి ♦ లలితచరిత
నాతి యీమెయు బ్రోవుమీ ♦ నన్యకృపను.

సోదరా! ఎంతసాహసము సేయ నెంచితివి. ఒకవేళ యీమెయందు దోషంబుండిన నుండుఁగాక. తల్లిని జంపుదువా! ఇట్టికార్యం బాచరించినపిదప లోకంబునఁ దల యెత్తి మెలంగఁగలవా? అక్కఱలేదా. చాలుఁజాలు. శాంతివహించి యింతట నూరకుండుము.

భర—తమ్ముఁడా!

తే॥ గీ॥ అన్నగారికి ద్రోహంబు ♦ నాచరించె
తండ్రిపాలిఁటిమృత్యువై ♦ తనరెనీమె
నీమెఁజంపినఁబాపంబు ♦ నెంతయైనఁ
బొందఁగాఁబోము మకమింకఁ ♦ బుడమియందు.

శత్రు—ఇంక నీకోపోద్యోగము చాలింపుము. మనకోపం బబలలపైనా చూపించుట. ఇట్టి దుష్కార్యం బాచరించితివేని శ్రీరామచంద్రుం డింక మన మొగంబులఁ జూచునా? వినుము. ఆప్రక్కనుండి కౌసల్యామహాదేవి యేదియో పలుకుచున్నది. (ఇరువురును నాలకించుచున్నారు)

—తెరలో—

ఉ॥ కావలెనంచుఁగోరుకొనె ♦ కైక ధరాతలమెల్లనీకు సం
భావితలీలమోదమునఁ ♦ బట్టముగట్టగ నింకనేల నీ
భావమునందుసందియము ♦ పాలనసేయు మరాజకంబునై
భూవలయంబు బాడగును ♦ భూరిగుణాకర పుత్రిరత్నమా!

కుమారా ! భరతా ! ఏలశంకించెదవు? ఎంతయో యభీష్టపడి యింతటి మహాకార్యం బాచరించిన మీతల్లిగారి కాశాభంగంబుఁ గూర్చుట నీకుఁ దగదు. పాపము. రాజ్యమేలుకొమ్ము.

భర—(శత్రుఘ్నునిజూచి) తమ్ముడా ! చూచితివా ! కౌసల్యామహాదేవిగారి యెత్తిపొడుపుమాటలు. ఇవి వజ్రబాణంబులవలె హృదయంబు భేదించుచున్నవికదా. అక్కటా ! ఏమిసేయుదుము. (ప్రక్కకుదిరిగి కౌసల్యతో) ఓ,కౌసల్యామహాదేవీ! కైకగావించిన దుష్కార్యంబునఁగూర్చి నేనేమైన వినియుంటినేని బ్రహ్మహత్యాపాతకం బొడిగట్టికొన్నవాఁడనగుదును. చండాలియై యిట్టి సాహసకార్యం బాచరించిన నాతల్లిపలుకుల నేవాలించి యగ్రజుండులేని యీరాజ్యంబును నేను బాలింతునా ! తల్లీ ! రామునియందు నాకుఁగలభక్తి నీవెఱింగియుండియు నిట్లుల వచించెదవు. జననీ నీపాదంబులసాక్షిగఁ బల్కుచుంటిని. నేనిదే ప్రయాణమై యన్నగా రెక్కడనుండునో యక్కడకేగి యాయన చరణాంభోరుహంబులపై వ్రాలి బ్రతిమాలుకొని యయోధ్యకుఁ దోడితెచ్చెదను. నామాటలను నమ్ముము. (శత్రుఘ్నునింజూచి) తమ్ముఁడా ! శత్రుఘ్నా ! నీవిప్పుడే మన గురువులవారగు వసిష్ఠమహాముని సన్నిధానంబున కేగి నేను రామచంద్రుని సన్నిధి కేగుదునని చెప్పి మనప్రయాణంబునకుఁ దగిన సన్నాహం బాచరింపుము.

కైక—(తనలో) అన్నా ! నేనీకార్యం బేల యాచరించితి. కుమారుని సంగతిఁ దెలియక యిట్లు జేసితినే. ఇతఁడు నామాట వినునట్లు లేదు. అయ్యో! నలువురిలోఁ దలయెత్తి మెలంగుట కష్టముగానున్నదే. ఏమిసేయుదును. (ప్రకాశముగా) కుమారా ! నేఁజెప్పువాక్యంబు లాలింపవా ? నలువురిలో నన్ను దలయెత్తి మెలంగనీయవా ?

భర—ఇంకను సిగ్గులేక పలుకుచుంటివి. దుష్టాత్మురాలా ! నీకిట్టి పాపపుటుపదేశం బాచరించిన దెవరు ?

(తెరలో)

ఓయీ! మందరయని యెఱుంగుము.

భర— ఆఁ! ఏమీ! మందర యిట్టి దుర్బోధచేసెగా! మందరను బట్టికొని దండింపవల యును. రమ్ము.

(తెరలో)

నీవు వచ్చుచుంటివని నూతిలోఁబడఁ బరుగిడుచున్నది,

భర— ఇదే వచ్చుచున్నాను. పోనీయక పట్టుకొనుము.

(శత్రుఘ్నునితో నిష్క్రమించుచున్నాడు.)

(తెరవాలును)

---

రంగము—చిత్రకూటము.

(ప్రవేశము రాముఁడు, సీత.)

**రాము**— తే॥ గీ॥ ఎండకన్నెము వానకన్నెము యెఱుఁగ
వెప్పుడక్కటా నావెంట నేఁగుదెంచి
పడఁగరానట్టికష్టముల్ పడుచునుండఁ
జూచియెట్లోర్తునిన్నును సుందరాంగి.

ఓ! జనకరాజపుత్రీ! నీవు పడుచున్న కష్టములు చూడలేక నాగుండెలు పగిలిపోవు చున్నవి. వేనవేలు దాసీజనంబులు నిరంతరంబును భక్తిమీర సేవింప శుద్ధాంత సౌధంబులయందు వసియించు నీకు భీకరశార్దూలమృగంబుల కాకరంబైన ఘోరారణ్యంబులయందు వసియించు గతి పట్టెనుగదా. అయ్యయ్యో! నామూలంబున నెట్టిశ్రమలు పడుచుంటివి. ఓవిదేహరాజనందనా! నన్ను వివాహంబాడి నిరంతరంబును సౌఖ్యాంబుధిని దేలుదువని తలంచి నాకు నిన్నొసంగెఁగాని; నాతోడ నీవుగూడ వరణ్యాంబులపాలగుదువని నీతండ్రి తలంపలేదుకదా. నావెంట రావలదని యెన్నిసారులు నొక్కినక్కాణించినను వినకుండ వచ్చి పడరాని పాట్లు పడుచుంటివికదా. అయ్యో! నీదేహం బెట్లు శుష్కించినదో చూడుము. పంచభక్ష్య పరమాన్నంబులతోడను, దధిఘృతక్షీరంబులతోడను ననుదినంబును గడుపార భుజియించు నీవు కందమూలఫలంబులు భుజియింపుచుంటివికదా,

సీత—నాథా! ఎట్లుపలుకుచుంటిరి. నేను కష్టంబులఁ బడుచుంటినా! పతి చెంగట లేకుండ వేనవేలు దాసీజనంబులు బరిచర్యలు సేయుచుండ శుద్ధాంతసౌధంబుల యందు వసించుచుండినను బడఁతికి సౌఖ్యంబు గలుగునా! పతినివిడనాడి తాను సౌఖ్యంబులందఁదలఁచెడి పతిబ్రతు కేల? ఎన్నియిడుమలు ప్రాప్తించినను పతి నిమాత్ర మెన్నఁడును నెడఁబాయక చరించు సద్గుణాఢ్యయగు యువతి యుభయలోకపూజితయై తనరును. ఓప్రాణేశ్వరా! నేను శ్రమపడుచుంటినని మీ రెప్పుడును దలంపవలదు. మీచెంగటనుండి నేను బడుచున్న శ్రమయంతయు సౌఖ్యంబుగనే భావించుచుంటిని. మిమ్మెడఁబాయక మీవెంటవచ్చుట నాపూర్వపుణ్యవిశేషంబని సంతసించుచుంటి.

రాము—రమణీమణీ! నాయందుండు భక్తిచే నీవట్లు వక్కాణించుచుంటివిగాని శ్రమలు సుఖములెట్లగును. అంతటి మహారాజు గర్భంబున జన్మించి దశరథునకుఁ బెద్దకోడలవై నాకు భార్యవగు నీకీ యిడుమలు తప్పలేదుకదా! అవును. ఇందులకుఁ జింతింపనేల? సమస్తంబును నాభారతీపతి లిఖించినట్లు జరుగుచుండును గదా.

సీత—నాథా! జగంబెల్ల ధాతవశంబేకదా. చీఁకటులు పోయి వెన్నెల వచ్చునట్లు దేహం బెప్పుడును గష్టసుఖంబులు సమంబుగా ననుభవింపవలయును. ఇందుకై మీరు విచారింపవలదు.

రాము—అవును నీవు చెప్పినది నిశ్చయమే.

[తెరలో ధ్వనివినవచ్చును]

సీత—ప్రాణేశ్వరా! ఏదియో ధ్వని వినవచ్చుచున్నది. రాక్షసు లెవ్వరును వచ్చుచుండుట లేదుకదా.

రాము—అవి రాక్షసార్భాటంబులు కావు. ఒకవేళ రాక్షసులే యరుదెంతురనుకొమ్ము. ఖడ్గంబు నాయొద్దనేయున్నదిగదా. నీకు భయమేల?

సీత—మీయుండనుండగా నాకు భయమెందులకు?

రాము—(ఎదుటఁజూచి) అదిగో చూడుము! ఫలంబులకునరిగిన లక్ష్మణుం డంత తొందరగాఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడేమిచెపుమా! అతనికేదైన హాని సంభవించియుండలేదుకదా!

సీత—అట్లెప్పుడును జరిగియుండదు.

లక్ష్మ—(అంత తొందరగా కరవాలముధరించియున్న లక్ష్మణుడు ప్రవేశించి వెనుకకు జూచుచు గోపముతో)

మ॥ ధరణీరాజ్యము నెల్లఁ గైకొని యు స్వాం◆తంబందు నూహింప కీ
కరణిన్ గాననమున్ వసింపఁగను జ్యే◆ష్ఠున్ బంపి, యుద్ధానిచేఁ
బరితృప్తిన్ గనలేక రాఘవు నితఁ ◆ భంజింపఁగా నెంచితే
భరతా! రమ్ము ఖరాసిఁ జూపితి నిదే ◆ ప్రాణంబులందీయుఁగన్.
తే॥ గీ॥ సోదరుని వధియించిన ◆ సూడు కాడ
టంచు నిందవచ్చిన ననునే ◆ నందువాఁడ
పాపకృత్యంబు సేయ భా◆వమున నెంచు
నీదుప్రాణముల్ దీసెద ◆ నిక్కముగను.

ఓరీ! మహాపాతకవర్తీ! భరతా! ఎంతదుష్కార్యము చేయసాహసించితివిరా! కైకా మహాదేవి కిట్టి తుచ్ఛమంత్రం బుపదేశించి, రాజ్యంబు స్వీకరించి, శ్రీరాముని నడవుల పాలుఁ గావించి యంతట నూరకొనక నీయనఘుని పైకిఁ గయ్యంబున కరుదెంచి గురుద్రోహంబుగూడఁ గట్టికొనఁ దలంచితివా! ఔరా! నీచమతీ! నీకిట్టి యుపదేశం బెవ్వరు చేసిరి. కానిమ్ము. ఇట్లు దుర్నీతిపరుండవై యరుదెంచుచున్న నీయంతం బిప్పుడే చూచి కైకను నపుత్రవతిగాఁ గావించెద.

రాము—హరహరా! పాపము శమించుఁగాక. పాపము శమించుఁగాక. (లక్ష్మణుని జూచి) ఏమిది! లక్ష్మణా! దుర్నీతుఁడవై యుంటివేమి? ఇంతకోపమేల? ఎవ్వరిపై నాగ్రహపడుచుంటివి. అకారణంబుగ నాభరతుని నిట్లేల దూషించుచుంటివి. భరతుండు నీయెదుట లేడే. అతఁడేమి నాపైకి దండెత్తి వచ్చెనేమి? తమ్ముడా నీకేమైన గ్రహమేసోఁకెనో, పిచ్చియేపట్టెనో. ఇంమక కనులం తెఱచి కోపంబుమాని యిట విశ్రమింపుము.

లక్ష్మ—అన్నయ్యా! నాకు గ్రహమూ సోఁకలేదు. పిచ్చియూ పట్టలేదు. నే నన్నది యంతయూ సత్యమే! అదిగో చూడుఁడు. భరతుఁడు సైన్యసమేతుఁడై తమ కెద్దియో యెగ్గుసేయఁదలంచి వచ్చుచున్నాఁడు. అదిమీరు చూడక యీరీతిఁ బలుకుచున్నారు. అన్నా! భరతుఁడనగా నేమోయని తలంచితిని. దేవరకే హాని సేయఁదలపెట్టెను. ఔరా! దుర్మార్గుఁడు. ఎంతసాహసము సేయనెంచెను. కానిమ్ము. సోదరా! ఇంక సందియం బందనవసరములేదు.

తే॥ గీ॥ భక్తి నెల్లను నీరీతిఁ ◆ బాందోలి
యన్నయనుమాటఁ గ్రూరత ◆ మన్నుఁగలిపి

నిన్నుసిలుగుల బెట్టంగ ♦ నెంచియిటకు
వచ్చునాతనిజంపుదు ♦ భవ్యచరిత.

ఇదే ధనుర్బాణంబులును, ఖడ్గంబును కరంబుల ధరించియున్నాఁడను. ఇంక నాకనుజ్ఞనిచ్చి పంపుఁడు.

రాము — తమ్ముఁడా! లక్ష్మణా! శాంతించి యిటఁ గూర్చుండుము. సౌమిత్రీ! నీవెంతయు నజ్ఞానాబ్ధిలోఁ బడితివిసుమా! భరతుని యంతరంగంబు నెఱుంగనేరక యీరీతి వక్కాణించితివి. ఆతఁడు నాకెప్పుడును నెగ్గునేయఁ దలంచువాడుకాడు. నీకంటె నాయందాతఁ డెంతయో భక్తితాత్పర్యములు బూని సేవింపుచుండెడివాఁడు. అట్టిభరతుఁ డేమి నాకుఁ గీడుసేయఁదలంచి మనకడ కరుదెంచునేమి? అనుజా! నీదురూహను మార్చుకొని సద్బుద్ధితో నుండుము.

లక్ష్మ — భరతుఁడు వచ్చుట యసత్యమందురా యేమి?

రాము — భరతుఁడు వచ్చుట సత్యమే. కాని యతఁ డెట్టిదుష్కృత్యమునైనఁ జేయుతలంపుతో వచ్చుచుండుటలేదు.

లక్ష్మ — అన్నయ్యా! సమస్తంబును దెలిసిన నీవట్లన్నచో నేనేమనఁగలను. మనకెన్నియాపదలు వచ్చుచుండినను మీరుమాత్రము శాంతమును వీడలేదు. మీశాంతమే యిట్టి పెనుబాములుపడుటకుఁ గారణంబైనది. భరతుఁడు మిమ్ము దర్శించుటకు వచ్చుచున్నవాఁడేని తనతోఁగూడ నొకరిద్దరు సేవకులనుదప్ప యింతసైన్యంబేల తోడ్కొనిరావలెను?

రాము — తమ్ముఁడా! వేయేల! ఆతనియూహ యిట్లయియుండును. మనల నెట్లయిన బ్రతిమాలికొని యయోధ్యకుఁ దోడ్కొనిపోవలెనను తలంపుతో వచ్చుచుండును. అంతియకాని వేరొకదురభిప్రాయమును బూని వచ్చుచుండుట లేదు.

లక్ష్మ — మీవాక్యంబులకు వ్యతిరిక్తంబుగ నేను బ్రత్యుత్తరంబిచ్చువాడను గాను. ఆభరతుని రాకకు గారణంబిప్పుడే దేవరవారికి విశదంబగుఁగాక. (అనికూర్చుండును.)

(అంత వసిష్ఠమహామునితో భరతుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వసి — (స్వగతము) ఈభరతుం డింతదూరంబు కడుశ్రమపడివచ్చెనుగాని విఫలమనోరథుండై మరల సాకేతంబున కేగవలసినదేయని తోఁచుచున్నది. నిరంతర సత్యవ్రతాచారపారీణుఁడును, జనకాజ్ఞాపరిపాలకుండును, సాక్షాద్విష్ణుస్వరూపుఁడును

నగు శ్రీరామచంద్రుండు తాఁబూనినప్రతిజ్ఞకు భంగము గావలిఁచునా! అ
ట్లెన్నఁటికిని బ్రసతిఁఁపఁడు.

భర—(వసిష్ఠునిజూచి) మునీంద్రా! ఆగుహుఁడుచెప్పినప్రదేశం బిదియేకదా.

వసి—అవును. అదిగో! ఎదుటఁజూడుము. అవృక్షచ్ఛాయను శ్రీ రామ లక్ష్మణ సీత
లాసీనులైయున్నారు. మనము సత్వరంబుగఁ జూతమురమ్ము.

భర—ఆహా! కాలమహిమ!

సీ॥ వరసౌధములయందు ♦ వసియించుపుణ్యుండు
వసియించుచున్నాఁడు ♦ వనములందు
హంసతూలికశయ్య ♦ నలరారుకసుభోగి
తనరుచుండెను నేఁడు ♦ దర్భశయ్య
మేలైనహారాళి ♦ మేనఁదాల్చెడివాఁడు
తాల్చుచున్నాఁడు రు♦ద్రాక్షమాల
పట్టుబట్టలనెప్డు ♦ గట్టుచుండెడిభోగి
కట్టుచుండెను నార ♦ బట్టలెలమి
తే॥ గీ॥ భక్తిమీరఁగనెప్పుడు ♦ పరిజనంబు
గొలువ శీవిమైతనరారు ♦ లలితచరతుఁ
డక్కటా భాగ్యములవీడి ♦ యడవులందుఁ
దనరుచున్నాఁడు నేఁడిదే ♦ ధాతవ్రాఁత.

జనకక్ష్మాధీశుని కనుంగుసుతయై, దశరథభూపాలునకుఁ బెద్దకోడలైన సీతామహాదేవి యెట్టి
యిడుములబడుచున్నది? ఆహా! అగ్రజునిసేవింపుచుఁ జరించుటకు లక్ష్మణుం
డెంతపుణ్యంబాచరించెనో (ఇంచుకయూరకుండి) ఇంక నేనాలోచింపనేల? రా
మచంద్రుని చరణసన్నిధానంబుజేరి సమస్తంబును విన్నవించి యయోధ్యకుఁ దో
డ్కొనిపోయెద. మునీంద్రా! రామచంద్రునకు జనకుని మరణవృత్తాంతంబును
జెప్పుటను నాకు నోరెటాడును. అయ్యో! నేనేమిసేయుదును.

వసి—వత్సా! భరతా! గతించినదానికి విచారించినబ్రయోజనమేమి? ఇంక శ్రీరా
ముని జూతమురమ్ము, (అని యిరువురును శ్రీరామ లక్ష్మణ సీతలను సమీపించు
చున్నారు)

లక్ష్మ—(వసిష్ఠభరతులను జూచి రామునితో) అన్నయ్యా! వసిష్ఠమహామునీశ్వరసమే
తుఁడై భరతుండు వచ్చుచున్నాడు.

రాము—ఏమీ! వశిష్ఠులవారుగూడ వచ్చుచుండిరా! అట్లయినచో మనమెదురుగఁ
బోయి తోడ్కొనివత్తము. (అని యించుకనడచి వసిష్ఠ భరతులను జూచి) ముని
కులగరిష్ఠా! వసిష్ఠా! భవచ్చరణ పంకేరుహంబులకు సేవకుండగు రాముండిదే నమ
స్కరించుచున్నాఁడు.

లక్ష్మ—సకలలోకపూజితంబగు మీపాదద్వయంబునకు లక్ష్మణుండిదే నమస్కారమొన
ర్చుచున్నాఁడు.

సీత—మునీంద్రా! ఇదే నమస్కరించుచుంటి.

వసి—సీతారామలక్ష్మణులారా! మీరందఱును సుఖులైయుండురుగాక.

రాము—తమ్ముఁడా! భరతా!

తే॥ గీ॥ అడవులకునేను వీరితో ♦ నరుగుదెంచు
నప్పు డీవు పురమున లే♦వంచుమదిని
నెంతయోగుందినాడను ♦ చింత చేత
జూడనైతినినిన్నంచు ♦ శుద్ధచరిత.

ఆసమయంబున నిన్నుఁజూడనందులకెంతయో చింతించినాడను.

భర—సోదరా! ఆపాపపుకైక గర్భంబునఁబుట్టి నేనుగూడ నిందకుఁబాత్రుఁడనై మీకుఁ జెప్ప
రానిదుఃఖంబుగూర్చినవాఁడనైతిఁగదాయని మిగులశోకించుచుంటి.

రాము—తమ్ముఁడా! ఇందుకైకమ్మగారుగాని నీవుగాని నాకుదుఃఖముగూర్చినదేమున్న
ది. తండ్రిగారిసత్యంబు గాపాడుట నాకు ముఖ్యమైనకార్యముగదా!

భర—అన్నయ్యా! సర్వమునుదెలిసిననీకు నేనేమని విన్నవింపఁగలను. దురాత్మురాలగు
నాతల్లి యట్టివరంబులుకోరగనే తండ్రిగారు ముందువెనుక లారయక యవియొసం
గిరి. అవి మీరుపాలింపఁదలంచి యిట్లరుదెంచిరి. దీనివలన మనకెంతముప్పువాటిల్లు
నో దేవరయెఱుంగరైతిరి.

రాము—ఏమీ! మనకేమిముప్పువాటిల్లినది. భరతా! మనల నతిప్రియంబుతోఁ జూ
చెడి తండ్రిగారు క్షేమంబుగా నున్నారుకదా! మాగ్గురుతల్లులకును కుశలమే
కదా.

భర—(కన్నులనీరు గార్చుచున్నాఁడు)

రాము—అయ్యో! ఇట్లు కన్నీరుగార్చెదవేల! కారణముచెప్పి సంతాపంబును దీర్చుము.

భర—అన్నయా! చెప్పుటకు నాకు నోరాడకున్నది. (అని రాముని పాదంబులపైఁ బడుచున్నాఁడు)

రాము—అక్కటా! ఏమిది! అంతకంతకు విలపించెదవేల? తండ్రిగారి కేమానియుం సంభవించలేదుకదా. (వసిష్ఠునిజూచి) సకలమునిజనశ్రేష్ఠా! వసిష్ఠా!

తే॥ గీ॥ కన్నులనునశ్రుబిందువుల్ ♦ గార్చుచుండె
కారణంబేమొకాని పల్కఁగలేఁడు
దయవహించి నీవైనను ♦ దప్పకిపుడు
జెప్పి సంతాపమును దీర్ప ♦ మొప్పుగాంచు.

వసి—(రామునిజూచి) వత్సా! రాఘవేంద్రా! ఇంకనీయొద్ద దాఁచినందువలన నేమి ప్రయోజనమున్నది?

ఉ॥ నీవిటులేగుదేరఁగను ♦ నీజనకుండు సమస్తసౌఖ్యమున్
బోవిడనాడి మానికుల ♦ పుంగవుఁడిచ్చినశాపకారణం
బే విధియాట నీకొఱకు ♦ నెంతయుఁజింతిలి రామరామ! స
ద్భావచరిత్ర! పుత్ర యని ♦ తద్దయుఁ గుందుచువీడె జీవముల్.

(రామ లక్ష్మణ సీతలు హా! యని మూర్ఛిల్లుచున్నారు)

రాము—(మూర్ఛిల్లిలేచి) హా! తండ్రీ! నిరంతరసత్యవ్రతాచారపారీణా! మమ్మువాసి దేవతాధామంబున కరిగితివా! అయ్యో! మాకేమిగతిగల్పించితివి! హా! సుత వత్సలా! నీమరణంబునకు నేనేకదా కారణము.

మ॥ జనకా నీదగుసత్యవాక్యమును శీర్షంబందునందాల్చి యీ
వనిలోనుండఁగ రాగ మాకొఱకు నీ ♦ భావంబునం బెంగచే
దశయా రాఘవ రామ యంచు ఘన చింతాక్రాంతచిత్తుండవై
ననునీరీతిని వీడిపోయితివె యన్నా! యేమిసేతుర్ భువిన్.

తే॥ గీ॥ వనములకుమేము రథముపై ♦ వచ్చునపుడు
రథము వెంబడివచ్చుచు ♦ రామరామ

ఆఁపుమంచును బ్రతిమాల ♦ నాఁపనైతి
నెంతపాపిష్ఠినోకదా ♦ యెంచిచూడ

తండ్రీ! ఇట్లగునని కలనైనం దలంపనైతినే.

లక్ష్మ—హా! తండ్రీ! నేను నీపై నాగ్రహించితినని నీవిట్లు దేవతాధామంబు నలంకరించితివా!

సీత—హా! దశరథక్ష్మాపాలచూడామణీ! మేమడవులకు వచ్చుట యేకదా నీమరణంబునకుఁ గారణంబు.

వసి—కుమారులారా! గతించిన దానికి మీరిట్లు చింతించినందువలన నేమిప్రయోజనమున్నది. ఇంకమీరు ముందుకర్తవ్యమాలోచింపుఁడు.

రాము—అయ్యా! గురువర్యా! అంతటిదయాపరుండగు మాజనకుం డస్తమింపఁగా మేమీ దుఃఖము నెట్లుభరింపఁగలము?

వసి—వత్సా! రాఘవా! సమస్తమును దెలిసిన నీకు నేను జెప్పవలసినదేమున్నది. మరణము ప్రతిజీవియుపొందుట సహజమేకదా. ఇంకమీరు ధైర్యమునుదాల్చి చింత విడనాడుఁడు.

భర—(రామునిజూచి) అన్నయ్యా! ఈదుఃఖము మనందఱకిని సమానమే. నే నాపాపిష్ఠికైకగర్భంబునఁబుట్టి మీకుఁగూడ నాగ్రహముదెప్పించి లోకనిందకు బాలైతి. మనల నతిగారాబంబునఁ బెంచిన తండ్రిగారు దివం బలంకరించిరి. మహాపాపాత్మురాలగు నాతల్లి యట్టివరంబులు గోరునని నేను మీపాదసాక్షిగ నెఱుంగను. ఆమె యట్టివరంబులు గోరినంత నే మీ రిట్లువచ్చిరి. మీరులేని యీసాకేతంబును నేను బాలింతునా! ఆరాజ్యలక్ష్మిని భరించుటకు నేను శక్తుండనగుదునా! కావున నాతల్లి యాచరించిన దోషంబును సైరించి నాయందుఁ గృపవహించి సాకేతంబున కేతెంచి రాజ్యంబును బాలింపుచు మమ్మును బ్రజలను గాపాడుము.

రాము—తమ్ముఁడా! భరతా! కైకమ్మగారియం దావంతయు దోషంబులేదు. తండ్రిగారి సత్యంబు గాపాడుటకు నేనేతెంచితిని. అయ్యది పూర్తియగునంతకును నేను సాకేతంబున కేతేరను. అట్లేతెంచితినేని ధర్మవిరుద్ధంబగును. అసత్యమాడుటయు నధర్మకార్యం బాచరించుటయు సూర్యకులీనులగు నెవ్వరికిని దగదు. కావున నీవు చింతనువిడిచి సాకేతంబునకు మరలి రాజ్యంబు బాలింపుచుండుము. పదునాల్గువత్సరంబులును గడచిన యనంతరము క్షేమము సాకేతంబునకు వచ్చెదము.

భర—అన్నయ్యా! నీ వెన్ని చెప్పినను సరే. నీవులేని యీసాకేతంబు జొచ్చుటకు నా మనంబు సమ్మతింపదు. కానిమ్ము, ఏమిసేయుదును. నీచరణదాస్యము సేయుచు లక్ష్మణునితోపాటు నేనును వచ్చెదనుగాని పురంబునకుమాత్రము మరలఁజాల.

రాము—తమ్ముఁడా! అంతసాహసంబు సేయఁదలంపకుము.

భర—సోదరా! అట్లయినచో నన్నేమిసేయుమందువు?

రాము—గురువరుల యానతిప్రకారము సేయుము.

వసి—(భరతునిజూచి) భరతా! శ్రీరామచంద్రుండు వచించిన నిక్కంబు. అతఁడు పురికేతెంచుట యధర్మము. కావున నాతని పాదుకలను నీవు గైకొని వాటిని పీఠంబునందుంచి యాతనిమారుగ నీవు రాజ్యంబు పాలింపుచుండుము. (రాము నిజూచి) రాఘవేంద్రా! నీపాదుకలను భరతున కొసంగుము.

రాము—(పాదుకలను భరతున కొసంగును)

భర—(స్వీకరించి) మహాప్రసాదము.

రాము—తే॥ గీ॥ ప్రజలబిడ్డలభాతి గా ♦ పాడుచుండు
ధర్మమందుననిల్పి చి♦త్తంబునెపుడు
సత్యమేజయమని మాన♦సంబునందు
గట్టిగానమ్మిపాలించు ♦ ధర్మాతలమును.

ఇంక నీవేగుము. గురువర్యా! ఇంకమాకు సెలవిప్పింపుఁడు. ఇచ్చటనుండి మేమును బయలుదేరి యెచ్చటనేని తగుకుటీరమును నిర్మించుకొని వసియింతుము.

వసి—మంచిది.

భర—అన్నయ్యా! ఆజ్ఞనీయుము.

(అందఱును నిష్క్రమించుచున్నారు)

ఇది చతుర్థాంకము.





# శ్రీ రామ ప్రవాసము.



## పంచమాంకము.

రంగము—పర్ణశాల

ప్రవేశము రాముఁడు, సీత.

సీత—అబ్బా! ఇయ్యారణ్యంబంతయు భీకరరాక్షససంచారంబై యొప్పుచున్నది కదా. అన్నా! ఆమాయరక్కసి యెట్టిరూపుధరియించి మీకడ కరుదెంచెనో చూచితిరా! ఆశూర్పణఖకోరిక మీరు నిరాకరించితిరని మనల నేమియుఁ జేయదుకద. నాకదియే భయంబగుచున్నది.

రాము—తే॥ గీ॥ వలదువలదంచుఁ బలుకఁగా ♦ వచ్చినావు
అసురసంచారమైనట్టి ♦ యడవులందు
గడుభయంబును బొందుచు ♦ గాసిలుచుంట
నిన్నుఁజూచిన జాలియౌ ♦ నీరజాక్షి.

రమణీ! ఆశూర్పణఖవలన మన కెట్టిభయంబును లేదు. సామవాక్యంబులనాడి లక్ష్మణుని కడకుఁ బంపితిని.

సీత—ఆమె రాక్షసిగాన నెట్టిమాయలుబన్నునో యని యట్లంటినిగాని నాకు భీతిచేత గాదు. దేవర సన్నిధినుండఁగా నాకేమిభీతి?

తెరలో.

ఓరోరి! దుష్టనరుఁడా! ఎంతమోసకార్యము చేసితివిరా? కాముకబాధకులోనై నిన్నుజేరి యాచింపగాఁ గరుణఁబూనక నీతమ్మునిచే ముక్కు చెవులను గోయింతువా? కానిమ్ము. మిమ్మందఱ నేమిచేయించెదనో చూడుము.

సీత—నాథా! ఆపలుకు లెవ్వరివి?

రాము—ఇప్పుడు మనకడకరుదెంచిన శూర్పణఖ పలుకులే. లక్ష్మణునికడకేగగా నాతఁడామాయరక్కసి ముక్కుసెవులను జక్కుచేసియుండును. (ఎదుటఁజూచి) అడుగో! లక్ష్మణుండే వచ్చుచున్నాఁడు.

లక్ష్మ—(ప్రవేశించి) అన్నయ్యా! ఇవిగో ఫలంబులు. (ఫలంబులు రామునిముందుఁ బెట్టుచున్నాఁడు)

రాము—తమ్ముఁడా! ఆమాయరక్కసి యగు సూర్పణఖ నీకడకరుదెంచెనా?

లక్ష్మ—సోదరా! ఏమిచెప్పుదును. అది నాకడ కరుదెంచినది.

కం॥ వినరానిభాషణంబుల
నననందున సైఁపలేక ♦ యతికోపమునన్ :
వనితకు ముక్కుంజెవులను
ఘనముగ ఖండించినాను ♦ కారుణ్యనిధీ.

రాము—అన్నా! ఎంతసాహసము చేసితివి. స్త్రీయనియైనను దలంపవైతివే.

లక్ష్మ—అన్నయ్యా! ఆపె రాక్షసిగాన నట్లాచరించితిని.

— తెరలో —

తే॥ గీ॥ దైత్యవంశనాథునకు సో♦దరియటంచు
నైనఁదలఁపక యీరీతి ♦ నతివముక్కు
సెవుల మర్మదంబున జక్కు♦జేసినట్టి
నరులసైరించుట యిదేటి ♦ న్యాయమయ్య?

ఇప్పు డాశూర్పణఖపలుకులు విని రావణుం డెంతయాగ్రహపడునో. అనుర్త్యులను వధించలేదని మనపై నెంతకోపించునో. ఇప్పుడైనను నానీచమర్త్యులకు రాక్షసబలంబననేమో తెలుపుదు.

రాము—తమ్ముఁడా! వింటివా! ఆశూర్పణఖ ముక్కుసెవులను గోసినామనురోషంబునఁగాఁబోలు మనపైకి నెవ్వరో మిక్కిలిరక్కసులు దాడివెడలి వచ్చుచున్నారు.

లక్ష్మ—అన్నయ్యా! రానిమ్ము. ఆరాక్షసులకు మద్బాణచవిం జూపించెద.

— తెరలో —

శా॥ ఔరా భీతియొకింతలేకయిటు నుద్యద్బాహుధైర్యంబుతో
న ... తచెల్లెలంచు నయునన ♦ భావంబులోఁజూడకా

—

హా! రాముండట వానితమ్ముఁడట నహ్హ యామెయుఁగొట్టగా
నేరీతిన్ ఖరుఁడూరకుండునిఁకఁ దా నెంతేనిశిక్షింపకన్.

రాము—తమ్ముఁడా! వింటివా! ఎవఁడో ఖరుండఁట. మనలను శిక్షింపక యూరకుండఁడఁట. ఆరక్కసుఁడిప్డు మనపైకి వచ్చుచున్నట్లున్నది. రానిమ్ము. ఆతనిబలం బెట్టిదో చూతము. (సీతంజూచి) రమణీ! రక్కసులు వచ్చుచున్నట్లున్నారు. నీవు లోపలికేగుము. మేము వారి నెదిరించి వారిగర్వంబును మాలింపవలయును.

సీత—నాథా! రాక్షసులన్న నాకు భయంబగుచున్నది. దేవర యెట్లు పోరాడుదురో! అతిజాగరూకులై వర్తింపుఁడు.

రాము—రమణీ! ఆవిషయమై నీవేమియు భయంబందవలదు. చతుర్దశభువనంబులును నొక్కపెట్టున నెత్తివచ్చినను నీ రాముండు రణంబున భీతిల్లువాఁడు కాఁడు. ఇంక నీవుమాత్రము భీతినొందక లోపలికేగుము.

సీత—దేవర యాజ్ఞాప్రకార మాచరించుచున్నాను. (అని లోపలికేగుచున్నది)

రాము—తమ్ముఁడా! నీవుమాత్రము జాగరూకుఁడవై యుండుము.

లక్ష్మ—అన్నయ్యా! ఆముక్కిడిరక్కసులకు నేనా భీతిల్లువాఁడను!

(తెరలోఁ గలకలము)

రాము—అదుగో రక్కసులు వచ్చుచున్నారు.

(ఖరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

ఖరు—(రామలక్ష్మణులజూచి) ఓరోరీ! నీచమర్త్యులార! [illegible] నివ్వనంబును బ్రవేశించి నివసించుటయే గాక మారాక్షసులపై [illegible] సింపఁ దలంచితిరా! మా కాగ్రహము దెప్పించి [illegible] మిపై మనఁగలరే. ఔరా! ఎంతసాహసము! [illegible] భావింపక శూర్పణఖ ముక్కుచెవులను [illegible] క మీ రెందుబోఁగలరు. మిమ్మిరువుర నొక్కపెట్టున [illegible] ద. కాచికొనుఁడు.

రాము—ఓరీ! తుచ్ఛరాక్షసా! నీభీక [illegible] కులకును నిచ్చట భీతిల్లువారెవ్వరును [illegible] న నెత్తివచ్చినను [illegible]

నిరాక్షసంబుగావింపఁ గంకణంబు ధరించితిమి. కన్నును మిన్నును గానక మమ్ము జెనకవచ్చిన నీకాయువు పూర్తియైనదని భావింపుము.

ఖరు—ఓహోహో! ఏమిది!

తే॥ గీ॥ నరులుమీరు దలంపగా ♦ నరులఁదినెడి
వారలము మేము తలఁపఁగా ♦ భళిర! మమ్ము
జంపువారలెమీరలు ♦ శౌర్యమునను
నెవ్వరైననువిన్నను ♦ నవ్విపోరె.

లక్ష్మ—ఓరీ! వాచాటా! రాక్షసులతోటిపోరాటము మాకు క్రొత్త గాదు.

తే॥ గీ॥ గోచిపెట్టినదాదిగా ♦ కుతలమందుఁ
జంపుచుంటిమియసురల ♦ శౌర్యమేర్చి
తాటకినిజంపుట సుబాహు ♦ దర్పమడఁచు
టాదిగాఁగలకార్యంబు ♦ లరయుమయ్య.

రాము—ఉ॥ మాటలతోడనేమిపని ♦ మానవులంచును నెంచఁబోకు నీ
పోటుతనంబుఁ జూపుమిఁక ♦ పూర్ణభుజావిభవప్రసిద్ధిగన్
నాటగనేయువాఁడనిదె ♦ నవ్యశరంబులదర్పమేర్చి నీ
పోటుతనంబుదూల్చెదను ♦ పో! సురవైరులుగుందగన్ ద్రుటిన్.

ఖరు—మిమ్ముంతవఱకును జెండాడక యుపేక్షసేసి యూరకొనుట నాదియే లోపము. ఏమీ! మీరలు నాపోటుతనంబు దూల్పఁదగిన సమర్థులా! ఏదీ! చూతము. మీశౌర్యపరాక్రమంబు లెట్టివో యించుక చూపుఁడు.

రాము—దుష్టరాక్షసాధమా! నాశౌర్యపరాక్రమంబులు గనుంగొనుటకు నీవెంతవాఁడవురా! ఇదిగో! ఈశరంబును గాచికొమ్ము. (అని శరంబును బ్రయోగించుచున్నాఁడు)

దూషణుఁడు—(ప్రవేశించి) ఓయీ! ఖరా!

మ॥ నరులన్ జంపఁగ నింతజాగుదగునే ♦ నవ్యాస్త్రశస్త్రంబులన్
ధరణింగూల్పఁగరాదె యిప్పుడె మహా ♦ దర్పంబుజూపించుచున్

సురలోకేశ్వరవైరి సోదరినటుల్ ♦ సాక్షీ[illegible]యీ
దురహంకారులఁగూల్చి రావణుని సం♦తోషాబ్ధిఁ దేల్చెదన్.

(రామలక్ష్మణులఁజూచి) ఓరీ! నీచమర్త్యులారా! మాయెదుటఁబడి యింక మీరెందుఁబోఁ
గలరు. రాక్షసులతోఁ జెలగాటలాడఁదలంచితిరా! మాపరాక్రమం బెట్టిదో
చూచెదరుగాక. (అని శరంబును బ్రయోగించుచున్నాఁడు)

రాము—అనురాధములారా! మాకు మీరు భీతిల్లితిరేని యింకనలసిన రాక్షసులను సా
యము తెచ్చికొనుఁడు.

దూష—మిమ్ముఁగూల్చుటకు మాలో నొక్కఁడు చాలఁడా! ఎంతమంది రక్కసులు కా
వలెను.

7/74

లక్ష్మ—వృధాసంభాషణంబుతో నేమి ప్రయోజనంబున్నది? మీప్రాణంబులను దీయు
టకు మాశరంబులుగూడ మమ్ము గడుతొందరపెట్టుచున్నవి.

ఖరు—మాకును నట్లేయున్నది. ఇదిగో! మేము సంసిద్ధులమై యుంటిమి.

[ఖరుఁడును రాముఁడును యుద్ధంబుసలుపుచున్నారు.]

రాము—(శరమును జేఁబూని) ఓరీ! ఖరా! ఈశరంబు నిన్నుఁ దప్పక నంతంబు నొం
దింపఁగలదు. (అని బాణంబును బ్రయోగించుచున్నాఁడు. ఖరుఁడు నేలఁ గూలు
చున్నాఁడు)

దూష—

మ॥ ఖరునారాచపరంపరన్ హతునిగా ♦ గావింపగా నేను, సం
గరరంగంబునువీడి యేగుదనుచున్ ♦ గాంక్షింపగాఁబోకు ము
ద్ధురతన్ మిమ్ముల క్రూరబాణములచే ♦ దున్మాడి లంకేశ్వరున్
సొరిదిన్ సంతసవార్ధిముంచెదను ని♦చ్చో! గాచికొండీయికన్.

ఖరుఁడు నేలఁగూలినయంతనే నేను భీతిఁజెంది పాఱిపోవుదునని తలంచితిరేమో? అ
ట్లెన్నఁటికిని భావింపకుఁడు. మీయంతంబుఁ జూచితీరెదను.

రాము—తే॥ గీ॥ ప్రేలిప్రేలి తుదకు నట్లు ♦ గూలినాఁడు
ఖరుఁడు; నీదుహితుం డట్లె ♦ గతియెనీకు

బ్రాప్తమా నిష్ఠెమాడుమీ ♦ బవరమందు
నేటికీవృథాపలుకులు ♦ హీనచరిత.

దూష—అవును నిజమే. వృథాసంభాషణంబుతో నేమి ప్రయోజనంబున్నది. ఇదిగో శరములు విడుచుచున్నాఁడ. కాచికొమ్ము.

[ఇరువురును గయ్యంబు సేయుచున్నారు దూషణుఁడు నేలంగూలుచున్నాఁడు.]

రాము—తమ్ముఁడా! ఇక్కడ కీయిరువురును గూలిరి. అదిగో వీరిమరణంబుజూచి తక్కినరక్కసులు పరాక్రమంబున విజృంభించి మనపైకి వచ్చుచున్నారు. వారికిఁగూడ మన బాణచవిం జూపింతము. రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

---

(రంగము:—మారీచాశ్రమము)

[ప్రవేశము—రావణుఁడు—మారీచుఁడు]

మారీ—దేవా! లంకేశ్వరా! నీవేదియో గొప్పకార్యమును జేయఁదలంచి యీరీతి నింత తొందరగావచ్చితివని నే నూహించుచున్నాను. అది నిజమయ్యే యుండునా!

రావ—మారీచా! నీకుఁ దెలియని దేముండును. నిశ్చయముగా నీవూహించినట్లు నే నొక ఘనకార్యమును జేయఁదలంచి నీసహాయమును గోరియే యిట్లు వచ్చితిని.

మారీ—నీకు సహాయంబాచరించుటకు నేనెంతవాఁడను. నాయందుండు వాత్సల్యముచే నీవట్లు వక్కాణింతువు.

రావ—మారీచా! నే నెప్పుడైనను నసత్యమాడితినా! నారాక ముఖ్యముగా నీకడకే. నీసహాయంబును గోరియే వచ్చితిని. ఇదినిశ్చయము.

మారీ—లంకేశ్వరునకు సహాయంబాచరించునంతటి పుణ్యము నేను నోఁచికొంటినా! అందులకు నేను సమర్థుండ నగుదునో కానోయని సందియంబందుచున్నాఁడ.

రావ—నీవు నిజముగా నాయందుఁ గృపవహించి చేయఁదలంచినచో చేయఁగలవు. అందుకు సందియం బేమియు లేదు.

మారీ—అట్లయినచో నాకార్యమును దయఁబూని సెలవిమ్ము.

రావ — చెప్పుట కేమున్నది. అంతయు నీవెఱింగియేయుందువు. ఎవరో రాముఁడఁట. జాయాసహితుండై తమ్ముఁడు వెంటరా నరణ్యంబుల కేతెంచి దండకాటవిని వసియించుచుండెనఁట. ఆనీచమర్త్యులు మదోన్మత్తులై నాచెలియలి ముక్కు చెవులను జక్కజేసిరి.

మారీ — (భయమున భినయించును)

రావ — ఏమి! శరీరంబట్లువణఁకుచున్నది?

మారీ — ఏమియు లేదు. చెప్పుము.

రావ — నే నిప్పు డెట్లయినను నారామలక్ష్మణులను వంచించి యారాముని భార్యను లంకాపురంబునకుఁ జేర్పఁదలంచి యిచ్చటికి వచ్చితి. ఇందునీవు నాకుఁ దగినసహాయంబాచరింపవలయును.

మారీ — దైత్యేశ్వరా! నేను జెప్పుపలుకులను సావధానచిత్తుండవై యాలించి పిదప నీ యిచ్చవచ్చినట్లు సేయుము. ఆరామునిసంగతి నాకు సంపూర్ణముగఁ దెలియును. దైత్యకృత్యంబుల నొనర్చుటమాని నేనిట్లు తపోవృత్తిం బ్రవేశించుటకు రాముండే కారణము. రాముండన్న నీవు సామాన్యమర్త్యునిగాఁ దలంచితివి కాఁబోలు. ఆతఁడు కడుబాల్యంబునందే తాటకినివధించి విశ్వామిత్రయాగంబును రక్షించినాఁడు. ఆసమయంబునందు నేనును సుబాహుండును యజ్ఞంబు ధ్వంసంబు సేయఁబోవ రాముండు పరాక్రమంబేర్చి సుబాహుంగూల్చి నాపై బాణంబు ప్రయోగింప నాబాణవేగంబునకు నేను సముద్రతీరంబునఁ బడితి. నాటంగోలె నాకు రామునిదలంచుకొన్న మనంబున భయంబు జనించి రాముండే నా యెదుటకు వచ్చినట్లు తోఁచుచుండును. అప్పటినుండియు నేనట్టి క్రూరకృత్యంబులను జేయక తపోవృత్తిం బ్రవేశించితిని. రాక్షసేశ్వరా! నాపలుకు లాలింపుము. రాముండన మహాపురుషుఁడు. విష్ణ్వంశసంభూతుండని వినియున్నవాఁడ. అకారణంబుగ నాతనిజాయ నపహరింపఁదలఁచుట నీబోటిబ్రహ్మజ్ఞునకుఁ బాటికాదు. సమస్తధర్మాధర్మంబులను నీకుఁ దెలిసియేయున్నవి. నేను వేరుగఁ జెప్పనక్కరలేదు. ఆతఁడు నీకెట్టియపకారంబను నాచరించియుండలేదు. అట్టిచో నీవాతని కకారణంబుగఁ గీడు సేయుట యేటిన్యాయము. ఆతని మహిమంబును, శస్త్రవిద్యాపాటవంబును, శౌర్యపరాక్రమంబును నాకుఁ దెలియునుగాని నీకేమి తెలియును. కావున నోదశకంఠా! వేయేల నీవాతని తెరువునకుఁ బోవక లంకాపురంబునకు మరలుటయే నాయభిప్రాయము.

రావ — వహ్వ ! మారీచా ! ఇట్లు పలుకుట యెప్పుడు నేర్చుకొంటివి. నీవేమియో సహాయంబాచరింతువని పుట్టెడాసతో నే నరుదేరగా నీవిరీతి వచించుట యేటి గుణము. నీకు నాయందుగలిగిన స్వామిభక్తి యిదియేనా ! నీవిట్లు కృతఘ్నుండ వగుదువని యెన్నడును దలంపలేదు. నీప్రవర్తనంబును, నీగుణంబులును నేటికి దేటతెల్లంబుగాఁ దెలిసినవి. ఇట్లు నీవు నాకు సహాయం బాచరించుటకు నిరాకరింతువని కలనైనం దలంపలేదు. నీవు బహుమాయాధురంధరుండ వనియు, నా కార్యము తృటిలో నెఱవేర్పఁగలవనియు, నమ్మి వచ్చినందుల కిదియా నీవిచ్చు ప్రత్యుత్తరము. నాచెల్లెలి ముక్కు సెవులంగోసిన యాహీనమర్త్యులను సైరింపుమని యా నీవు బోధించుచుంటివి. చాలుఁ జాలు. చేతనైనచో నేఁజెప్పినప్రకారము సహాయం బాచరింపుము. లేదేని యూరకుండుము. నీకుఁ దెలిసిననీతులు నాకు మాత్రము దెలియక పోలేదు.

మారీ—(స్వగతము) ఆహా ! నాయుపదేశవాక్యంబు లీతనికిఁ గష్టంబై తోఁచినవి. ఈతఁడు తాఁబట్టిన కుందేటికి మూఁడే కాళ్ళనువాఁడుకాని యొరులమాట వినువాఁడు కాఁడు. కానిమ్ము. ఎవరు త్రివ్వుకొనినగోతిలో వారే పడుదురు. ఇప్పట్టున నేనీతనికి సహాయం బాచరింపకుండుట యనుచితంబుగాదు. చేతనైనంతవఱకును జేసితీరెదను. చచ్చితినా రామునిహస్తంబునఁబడి చచ్చి మోక్షంబునందఁగలను. (ప్రకాశముగా) దశకంధరా ! నేఁజెప్పినపలుకులు నీకు రుచికరంబుగ నుండు నేమో యని వచించితిని. నీవు విననైతివి. నేనట్లు వక్కాణించితినని కృతఘ్నుండనని యెంచఁబోకుము. నే నెప్పుడును నీయందు భక్తివిశ్వాసములుగలిగి వర్తించువాడనే యని నమ్ముము. నాచేతనయినంతవఱకును సహాయం బాచరించెద. సందియంబందక యెట్టిసహాయం బాచరింపవలెనో దయఁబూని చెప్పుము. ఈసేవకుం డయ్యది నేయుటకు సంసిద్ధుఁడై యున్నవాడని నమ్ముము.

రావ—(మారీచుని శరీరముపైఁ జేయివైచి) భళిరా మారీచా ! నీవు నాకు సహాయం బాచరించినచో నాకార్యము కొనసాగుటయెంత. మారీచా నాకుఁ జేయవలసిన సహాయంబును వినుము. ఇప్పుడు నీవు మాయహరిణంబవై రాముఁ డున్నతావున కేగి యాతనిభార్యచెంగట మెలంగుచు నెట్లయినను రామలక్ష్మణులను సీతనెడఁబాయునటు జేసి దూరముగఁ గొనిపొమ్ము. అనంతర మొంటరిగనున్న రాముని భార్యను నేనెట్లయిన వంచించి రథముపైఁ బెట్టుకొని లంకాపురంబున కేగెదను. ఈస్వల్పకార్యము మాత్రము నాకుఁ జేసిపెట్టుము. నీ యుపకారముమాత్రము మఱచిపోవను.

మారీ—(స్వగతము) నేను రామునిచేతిలోఁబడి చచ్చుటయే నిశ్చయము. ఇతనికి నేను సహాయంబాచరించుటకు నిరాకరించి యీతనిచే మాటలుబడుటకన్న మాయలేడినై రామునియెదుటకుబోయి యాతనిచే బ్రాణంబులుగోలుపోవుటయే మంచిది. కానిమ్ము. ధైర్యమును వహించి యికార్యమునుజేయ సమ్మతించెద. (ప్రకాశముగా) రాక్షసేశ్వరా! నీయాజ్ఞాప్రకారము దప్పక యాచరించెద. ఇదే నేనిప్పుడే మాయాహరిణంబనై రామునిసన్నిధి కేగెదను.

రావ—ఇప్పుడు నాకు సంతోషము కలిగినది. నేనును నీప్రాంతంబునందే సంచరించుచుందును. నీవు సత్వరంబుగఁ బోవలెను.

మారీ—ఇదిగో! నేనిప్పుడే పోవుచుంటిని.

రావ—మంచిది.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

---

## రంగము :—పర్ణశాల.

### ప్రవేశము రామలక్ష్మణసీతలు

సీత—(ఎదుటనున్న హరిణంబును జూచి) ఆహా! ఏమి! ఈహరిణంబుయొక్క సౌందర్యము. ఇట్టిదానిని నేనెప్పుడును నెచ్చోటను జూచియుండలేదు. పెంపుడులేడివలెనే దగ్గఱకువచ్చుచుఁ బోవుచున్నది. ఆహా! ఇది నాకడనున్నచో గడు బాగుండునుగదా. నాథా! దీనితో నాడికొన నాకెంతెయు ముచ్చటయగుచున్నది. దయచేసి పట్టియిత్తురా!

రాము—ఈకురంగంబును జూడగనే నాకును మిగుల నచ్చెరువు జనించుచున్నది. దీనిం బట్టితెచ్చుటకు నాకును ముచ్చటయేయగుచున్నది. అందుపై నీవుగూడ గోరితివి. నీకోరికతీర్చనినాజన్మ మేల? తన్వంగీ! ఇప్పుడే నేనాలేడిని నాసామర్థ్యంబునఁ బట్టితెచ్చి యిచ్చి నీయభీష్టంబును దీర్చెద. (లక్ష్మణునిజూచి) లక్ష్మణా! నేనాహరిణంబును బట్టితెచ్చెదను. నేవచ్చువఱకును నీవతిజాగరూకుఁడవై యిచ్చటనుండుము.

లక్ష్మ—అన్నయ్యా! నీవీమె యభీష్టంబును దీర్చుటకు నే నభ్యంతరపెట్టువాడనుగాను కాని యిట్టి విచిత్రమైన కురంగంబును మనమీప్రపంచంబున నెచ్చటను జూచియుండలేదు. ఇదేదియో మాయాకురంగమువలెఁ గానుపించుచున్నది.

తే॥ గీ॥ మాయరక్కసుఁ డెవఁడైన ♦ మనల మోస
పుచ్చఁగదలంచి యిట్టిరూ♦పునుధరించె
నంచు భావంబునందున ♦ నెంచువాఁడ
నన్న! రాఘవా యిప్పుడీ ♦ వరుగవలదు.

రాము—తమ్ముఁడా! నీవావిషయమునం దేమియు సందియంబందవలదు.

తే॥ గీ॥ హరిణమైనచో వేఁబట్టి ♦ యరుగుదెంతు
మాయరక్కసుఁ డైనచో ♦ మదమడంతు
నేదియైనను భయమంద♦నేల మనకు
సందియంబును వీడుమీ ♦ డెందమందు.

కావున నీవు సందియంబందక యీమెను జాగరూకతతోఁ గాపాడుచుండుము. నేనిదే పోయివచ్చెదను.

సీత—నాథా! శీఘ్రింబుగ రావలెనుసుఁడీ!

రాము—రమణీ! దొరకెనేని యీహరిణంబును జీవంబులతోఁ దెచ్చియిచ్చెదను. లేదేని దానిచర్మంబైనను దెచ్చియిచ్చెదను. నీవుమాత్రము జాగ్రత్తతోనుండుము.

(నిష్క్రమించుచున్నాఁడు)

సీత—మఱఁదీ! లక్ష్మణా! లేడినిజూచినప్పు డున్నయుత్సాహ మిప్పుడు లేకున్నది. మీ యన్నగారి నేల హరిణంబును బట్టితెమ్మనిపంపితినా యని సందియంబందుచుంటి.

లక్ష్మ—తల్లీ! నీవాయననుగూర్చి యేమియు సందియంబందవలదు. ఆయన యేవిధంబయిన భయంబును జెందువాఁడుకాడు.

సీత—అదియేమికారణమోకాని నామనంబున భయంబు జనించుచున్నది. అన్నా! ఆలేడికై నేనేల మీయన్నగారిని బంపితిని?

లక్ష్మ—నాసోదరునివిషయమై నీవేమియు భయంబందవలదు. ఆతఁ డింకొకత్రుటికాలంబులోనే హరిణంబును బట్టితెచ్చి నీకీయఁగలఁడు. ధైర్యమును బూనియుండుము.

సీత—నా కే మియక్కఱలేదు. ఆయన కంటఁబడిన నదియే చాలును.




-తెరలో-

హా! లక్ష్మణా! సీతా!

సీత—(భయము నభినయించుచు) లక్ష్మణా! నాకు మిగుల భయంబగుచున్నది. శరీరంబు గంపమెత్తుచున్నది. మీయన్నగారి కేదియో యాపద వాటిల్లగా నాయనయే యీరీతి మనలంగూర్చి పిలిచియుండును. అయ్యో! నే నింకొకత్తృటికాలంబైనను దాళఁజాల. కావున నీవతిశీఘ్రంబుగఁ బోయి రాముని వార్త నారసిరమ్ము. పొమ్ము. జాగుసేయకుము.

లక్ష్మ—తల్లీ! అయ్యది నాసోదరునిరవంబు గాదు. చతుర్దశభువనంబులును నొక్కపెట్టున నెత్తివచ్చినను భీతిల్లువాఁడు కాడు. ఎవఁడో మాయరక్కసుఁడు మనల వంచింపఁదలంచి యీరీతి నఱచినాఁడు. రామచంద్రున కేవిధమయినహానియు సంభవింపదు. నావాక్యంబులను నమ్మి నీవు చింతను బోవిడనాడి ధైర్యమును వహించి నాయన్నరాక కెదురుచూచుచుండుము.

సీత—లక్ష్మణా! నీవు సహజధైర్యశాలివియు వీరపురుషుండవును గనుక ధైర్యమువహించి యూరకొందువు. అబలనగు నేనట్లూరకొనఁగలనా! నీవెన్ని ధైర్యవాక్యంబులను బలికినను సరే. నామనంబుమాత్రం బాగక యున్నది. నానాధున కేదియో కీడు వాటిల్లియుండును. లేనిచో నిట్టికేక యేలవినఁబడును. ఏమైననుసరే. నీవీక్షణంబున నేగి నానాధునిజాడ నారసిరమ్ము. పొమ్ము.

లక్ష్మ—అమ్మా! నీకిదియేమివెఱ్ఱి? నాయన్న కాపదవాటిల్లినచో సూర్యచంద్రులు గతులుదప్పరా! భూమ్యాకాశంబు లేకమైపోవా! అది రాముని రవంబు గాదని నేను ముమ్మాటికిని ధైర్యంబుగఁ జెప్పఁగలను. నీవేమియుఁ జింతనొందవలదు. నా సోదరుఁ డరుదెంచువఱకును నిన్నతిజాగరూకతతోఁ గాపాడుచు నిన్ను వీడవలదని నాకాజ్ఞనొసంగినాఁడు. అట్టియెడల నిన్నిట్టి నట్టడవిని నెట్లువిడనాడి యేగఁగలను. క్రూరమృగసత్త్వంబులను జూచి నీవు భయంబందకుంగునా! తల్లీ! నాపలుకు లాలించి ధైర్యంబును బూనియుండుము.

సీత—లక్ష్మణా! నామనంబున ధైర్యము నిల్వకయున్నది. కావున సత్వరంబుగ నాధుని వార్త నారసిరమ్మని యెంతచెప్పినను గదలకుంటివే, అన్న కాపదవాటిల్లగాఁ జూచి యూరకొందువా! నీకు జాలిలేదా. ఇదియేనా నీకు నీయన్నయందున్న భక్తి. ఇన్నిదినంబులనుండియు నీనక్కినయంబులను జూచి మీయన్న

మోసపోవుచుండెను. ఔరా ! ఎంతకృతఘ్నుండవైతివి. ఇట్టివాఁడ వగుదువని యెన్నఁడును దలంపనైతి నే. నీవిధంబు జూడఁగా నన్నచేటుగోరియున్నట్లు దోఁచుచున్నది. ఓరీ ! పాతకీ ! ఇన్నిదినంబులనుండియు నిన్ను మన్నించుట పామునకుఁ బాలువోసి పెంచినవిధం బయ్యెను గదా. ఔరా ! ఎంతసాహసము నే యఁదలంచితివి. అన్న నావలకుఁబంపి నీవు నాకడ నుండఁదలంచితివా !

లక్ష్మ—హరహరా ! (అని చెవులుమూసికొని స్వగతము) అక్కటా ! ఈమె యెట్లుగా భావించినది. ఇప్పు డేమిసేయుదును. ఈమెను విడిచి యేగితినేని యేల యొంటరిగ విడిచివచ్చితివని సోదరుం డాగ్రహించునేమో. పోకయుంటినేని యీమెదుర్భాషలు భరింపశక్యము గాదు. ఇందుల కేమిసేయుదును. (ఆలోచించి) అన్నచేవచ్చు చీవాట్లను బడవచ్చును గాని యీమె కఠినభాషణంబుల మాత్రము వినఁజాలను. ఏమైననుసరే పోయెదను. (ప్రకాశముగా) తల్లీ! సీతామహాదేవీ ! ఎంతమాటపలికితివి. ముందువెనుక లారయక యిట్లుపలుకుట నీబోటి సాధ్వీమణికిఁ దగునా ! ఇన్నిదినంబులనుండియు మీకడ భక్తివిశ్వాసంబులతో మెలంగుచుండిన నాప్రవర్తనంబు నరయఁజాలక యిటంటివని యెంతయుఁ జింతించుచుంటి. అమ్మా ! రామునివార్త నారయ నే నేగితి నేని నీ కేమిహానివాటిల్లునో. ఒంటరిగ నుండఁగలవో లేవోయని యట్లంటిఁగాని మరియొండుకారణంబు గాదు. నామనం బెప్పుడును నిష్కళంకమై యొప్పుచుండునని నిరంతరంబును నీస్వాంతంబున నమ్ముము. తల్లీ ! ఇంక నేనాలసింపను. భవదాజ్ఞ నుపశిరసావహించి యిదే రామునిజాడనారయ నేగుచున్నాఁడ. నీవుమాత్ర మతిజాగరూకతతో నుండుము. (నిష్క్రమించుచున్నాఁడు)

సీత—(స్వగతము) అన్నిమాటలాడినఁగాని లక్ష్మణుండు కదలినాడుకాడు. అమ్మయ్యా! ఇప్పటికి నాకుఁ గొంతధైర్యము కలిగినది. లక్ష్మణుండు నానాథునివార్త దప్పక యారసిరాఁగలఁడు. (ఇంచుకయూరకుండి) ఏమోకాని కుడికన్నును గుడిభుజంబును నదరుచున్నవి. ఏమికీడు నాథునకు వాటిల్లెనో తెలియకున్నది. అయ్యో మనంబంతయు డోలాయమానమైనదే. అడుగులచప్పుడు వినవచ్చుచున్నది. ఎవరో వచ్చుచున్నట్లున్నది.

(సన్యాసివేషధరుఁడై రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రావ— (సీతంజూచి) శూర్పణఖచెప్పిన పర్ణశాల యిదియే. అదిగో ! ఆమెచెప్పిన కాంతకూడ నదిగో. శూర్పణఖచెప్పిన చక్కఁదనంబులన్నియు నీమెయం దుండు బోడఁ

గట్టుచున్నవి. ఇంక నేనాలోచింపనేల. మారీచుఁడు పన్నినమాయలో రామ లక్ష్మణులిరువురును బడిరికదా. వారు తిరిగి పర్ణశాలకు రాకపూర్వమే నే నీ యింతిని లంకాపురంబునకుఁ జేర్చవలయును. ఆలసించినచో మోసము సంభవిం పఁగలదు. కావున నేనింక నీమెంజేరెద. (సీతను సమీపించి) భవతిభిక్షాందేహి.

సీత—(రావణునిజూచి) మహాత్మా! మీపాదకమలంబులకు నమస్కరించుచున్నాను. మీరెవ్వరో నిరంతరతపోగరిష్ఠులగు మునీంద్రులవలె నున్నవారు. నాయందు గృపఁహించి యీయాసనంబున దయసేయుఁడు. మన్నాథుం డనుజసమేతుఁ డై యేతెంచి మీకుఁ బూజలు దన్పఁగలఁడు. (యుచితాసనంబును జూపు చున్నది)

రావ—రమణీ! దయారసంబును జిమ్ముచున్న నీవాక్యంబుల కెంతయో సంతసించితిని. నారీ! నీవెవ్వతెవు. నీపతి యెవ్వఁడు. ఇట్లేకతంబ నిమ్మహారణ్యంబున నుం టివేమి?

సీత—మునీంద్రా! అయోధ్యాపురాధీశ్వరుండగు దశరథచక్రవర్తికిఁ బెద్దకోడలను. రామచంద్రునకు భార్యను. మన్నాథుండు తనతండ్రి సత్యవాక్యంబును బాలింప నెంచి యరణ్యంబులఁ బదునాల్గుసంవత్సరంబులు వసింపఁ దమ్మునితోఁగూడ నరుదెం చియున్నాఁడు. నన్ను సీతయందురు. మునివర్యా! తమరెచ్చోనివసింపుచుం దురు. తమనామధేయం బెయ్యది? వినఁదగుదు నేని దయఁబూని సెలవీయుఁడు.

రావ—నీసంగతియంతయు వినినపిదప నాసంగతి దెలుపకయుండుట భావ్యముగాదు. రమణీ వినుము. పులస్త్యబ్రహ్మసుతుండగు విశ్రవసునకుఁ గైకేసియందుఁ బ్రా విర్భవించినాఁడ. లంకాపురంబును దేవతలెల్ల భయంబందఁ బాలింపుచుండు. రా వణాభిధానంబునఁ దనరుచుండు.

సీత—(భయమునభినయించుచుఁ దనలో) అక్కటా! మోసము. వీఁడు లోకకంటకుఁ డైన దైత్యుఁడు సన్యాసివేషధరుండై నాకడకు జేరినాఁడు. వీఁడు నన్నిపు మిసేయునోకదా! అయ్యో! ఏమియుఁ దోఁచకున్నది.

రావ—తరుణీమణీ! భయమందుచు నాలోచించుచుంటివేమి. త్యుండు సన్యాసివేషధరుఁడై నీకడకు జేరెననియా! ఇందుంగూర్చి నీవేమియు భయంబందవలదు. నేనిట్లేతెంచుటకు నీసౌందర్యమే కారణము. నన్నుంగూర్చి నీవావంతయు భయంబందవలదు. నీసౌందర్యంబునుగూర్చి నాసోదరుఁడగు ఖరా

ర్పణఖవలన విని నీయందు నామనంబు జిక్కుటంజేసి నిన్ను లంకాపురంబునకుఁ దోడ్కొనిపోఁదలంచి వచ్చితి. ఇట్టి ఘోరారణ్యంబులయందు నెండకెండుచు వానకుఁ దడియుచు నాహీననరునితో నీవేమిసౌఖ్యంబు లందుదువు. ఈనార చీరలు గట్టుటేమి ! నీసుకుమారశరీరంబును నీరీతి గాసిల్లఁజేయుటేమి ! నీయునికి నాకెంతయు బాగుండలేదు. సతీమణీ ! వేయేల నాతోఁగూడ లంకాపురంబున కరుదెంచుము. నిన్ను రాజ్యమహిషిగాఁ జేసిన, అనేకవేల దాసీజనంబులు నిన్ను నిరంతరంబును భక్తితో సేవింపుచుందురు. అదుగో రథం బచ్చోనే యున్నది. దాని నెక్కుము.

సీత —(స్వగతము) అన్నా ! లక్ష్మణుం డెంతచెప్పెనో యంతయు జరిగెనే ! కురంగంబును దేఁబోయిన నాథుండుగాని, యాతనిజాడ నరయఁబోయిన లక్ష్మణుండుగాని యింతవఱకును రారైరి. ఈముక్కడిరక్కసుఁడు నన్ను లంకాపురంబునకుఁ గొనిపోఁదలంపున వచ్చెనఁట. ఇప్పట్టున నానాథుండుగాని లక్ష్మణుండుగాని యరుదెంచినచో బాగుండునుగదా. అయ్యో ! నేనాభాగ్యమును నోఁచితినా ! అక్కటా ! ఈయసురవాతంబడునని బ్రహ్మ నానొసట వ్రాసెను గాఁబోలు. అయ్యో ! ఇప్పుడు నేనేమిసేయుదు. ఇతని కేమిచెప్పిన నేమిచేయునో. అయినను సామవాక్యంబులచే నిట్లు చెప్పెద. (ప్రకాశముగా) లంకేశ్వరా ! నీవు సమస్తశాస్త్రంబులును జదివినవాఁడవు. బ్రహ్మవేత్తవు. అట్టిచోఁ బరదారను హరింపఁ దలంచుట నీబోటి వానికిఁ దగదు. రామచంద్రునిదప్ప నన్యపురుషుని మనంబునఁ గలయందైనను దలంపను. మహారణ్యంబులలో నుండినను నాథుని చెంగటనుండుటంజేసి సౌధములయందు వసియించుచున్నదానికంటెను నెక్కుడుసౌఖ్యముగ నుందును. నీభాగ్యంబును, నీవిభవంబును దృణప్రాయము. శ్రీరామచంద్రుని సామర్థ్యంబును, మహిమంబును నెఱుంగక నీవిట్లు నన్నపేక్షించి వచ్చితివి. ఇది యాతం డెఱింగెనేని నిన్ను బుత్రామాత్యభృత్యాదివర్గంబుతో నేలపైఁ గూల్పఁగలఁడు. కావున నో రాక్షసేశ్వరా! నీకు నాయందుఁబుట్టిన దుర్బుద్ధిని మరలించుకొని వచ్చినత్రోవంబట్టి లంక కేగుము.

రావ—సద్గుణపూతా ! సీత ! పరదారలను హరించుట రాక్షసులకుఁ బుట్టుకతోడవచ్చిన బుద్ధి. ఎట్లయినను నిన్ను లంకకుఁ జేర్పఁదలఁచియే వచ్చితిని. రామచంద్రుండు నన్నేమియు సేయునని నీవన్నవాక్యంబులకు భీతిల్లి నేను మరలువాఁడను గాను. నేనుబూనినప్రతిజ్ఞను ద్రిప్పుటకు త్రిమూర్తులకైనను దరంబుగాదు.

సీత—(తనలో) అన్నా! ఈరక్కసుఁడు నన్ను గొనిపోవుటయందే కృతనిశ్చయుఁడై వచ్చినాఁడు. ఇప్పుడు నాకడ్డుపడువా రెవ్వరు! అన్నా! లక్ష్మణా! నిన్ను నిష్కారణంబుగఁ దూలనాడి పంపితిని. నీవైన నున్నచో నీతుచ్ఛుని దునిమి నన్ను రక్షింతువుకదా. అయ్యో! ప్రాణనాథా! రఘునాథా! సత్వరంబుగ రమ్ము. నీచదానవు బారిపడనున్న నన్ను రక్షింపుము. (ప్రకాశముగా) ఓయీ దానవనాథా! లోకంబులు బెగ్గిల శౌర్యపరాక్రమంబున లంక నేలుచుంటినంటివి. పతి చెంగటలేక యొంటరిగనున్న నన్ను దస్కరించి గొనిపోవ నెంచుట నీకేటిశౌర్యగుణము. నానాథుం డరుదెంచువఱకును నొక్కత్రుటికాలం బిచ్చట నుండుము. నాభర్త శౌర్యపరాక్రమంబులు నీకుఁ దెలియఁగలవు. దొంగవలె నీరీతి వచ్చి యేమేమియో ప్రేలసాగితివి. పరనారుల హరించుటకేనా బ్రహ్మ లంకాపురంబును నీపాలుఁజేసెను. ఇంతటనైనను నీబుద్ధిని మరలించుకొని వచ్చినతో) వంజనుము.

రావ—నీవనెడి భాషణంబులన్నియు నాకమృతతుల్యంబులై యొప్పుచున్నవి. నీవు నాని జరూపంబును జూచితివేని నాకోరికదీర్చెదవని నాయభిప్రాయము. ఇదే నాని జరూపంబును జూడుము. (రావణుని నిజరూపంబును జూపుచున్నాఁడు)

సీత—హా! రామా! రామా! లక్ష్మణా! (అని మూర్ఛిల్లుచున్నది)

రావ—ఇంక నేనాలసింపరాదు. ఈమెను నెమ్మదిగా రథముపైఁ బెట్టుకొని సత్వరమ్ముగ లంకంజేరెద. (మట్టిగడ్డతో సీతనెత్తుచున్నాఁడు)

(తెరవాలును)

ఇది పంచమాంకము.

